# నేటి సామ్యవాదము



## మినూ మసానీ



అనువాదం
వి. యస్. కృష్ణ,
సి. ప్రసాదరావు

దేశి కవితా మండలి
ఘంటశాల :: కృష్ణాజిల్లా
గవర్నరుపేట :: బెజవాడ

# పీఠిక

హిందూదేశములోని సామ్యవాదులు, తమ ప్రయత్న విధానములను పునః పరిశీలన చేసికొనునట్లును, తమ ఆశయములకు నూత్న నిర్వచన మొనరించుటకును ప్రోత్సాహ పెట్టుటయే యీ వ్యాసముయొక్క ప్రధానోద్దేశ్యము. అందువల్లనే యిది సమాధానములను సూచించుటకు ప్రయత్నింపక ప్రస్తుత మెదుర్కొనుచున్న యదార్థ పరిస్థితులను దృష్టిలో నుంచుకొని వారివారి స్వంత నిర్ణయములకు దారి తీయు ప్రశ్నలే యెక్కువ వేయబడినవి. నేనిందు లేవనెత్తిన అనుమానములు నా మిత్రులలో కొందరిని బాధపెట్టి నేను ఆత్మసిద్ధాంత విరుద్ధ భావుడనని వారు నిందించునట్లు చేయును; అట్టి నామిత్రులకు సత్యసంఘటనలే యీ కలవరమునకు కారణమనియు, సామాజికార్థిక వ్యవహారములలో న్యాయమును ప్రతిపాదింప దలచిన వారు, కులాసాగా కండ్లు మూసికొని, నోరు మూసుకొనియు ఉండజాలరనియు నేను చెప్పుచున్నాను.

సామ్యవాది ఆలోచనకు 20 వ శతాబ్దము తెచ్చిపెట్టిన నూతన సమస్యలను, ఒక వ్యక్తి స్వయముగా సమీక్షచేసిన అంశములే యిందున్నవిగాని, ఒక సంఘముయొక్క గాని, ఒక పక్షముయొక్కగాని అభిప్రాయ మిందు లేదు. యీ పుస్తకములోని రెండు వ్యాసములలోని విషయములను నే నాశించిన దానికన్న అధికముగా అభిరుచిని తీవ్రదృష్టి వివాదనను కలిగించుటచే అధిక సంఖ్యాకులగు పాఠక వర్గములముందు దీనినుంచ నాకు ప్రోత్సాహము కలిగినది.

1-3-1944<br>బొంబాయి.

ఇట్లు<br>ఎం. ఆర్. మసాని.

# I

## మిధ్యాప్రభాతము

ప్రతిరోజూ రష్యా సైనిక పురోగమనాన్ని గురించిన వార్తలు వస్తున్నాయి. అప్పటి కప్పుడే రష్యన్ సైనికదళాలు పోలిష్ భూభాగం మీద అడుగుపెట్టాయి. రేపోమాపో యూరపు తూర్పు మధ్యభాగములను కూడా ముట్టడించవచ్చు. యుద్ధానంతరం రష్యాకూడా యూరపు రాజ్యాలలో ప్రముఖశక్తిగా పరిణమించటానికి సావకాశాలగపడుతున్నాయి. కాబట్టి రష్యా రాజ్యాంగ విధానాన్ని గురించి వెనుకటికంటే ఎక్కువ సమగ్రంగా, స్పష్టంగా తెలుసుకోవలసివుంది. కాని దురదృష్టవశాత్తు ముఖ్యంగా మన భారతీయులలో అలాంటివిచక్షణా బుద్ధిబొత్తిగా లోపించిపోయింది. రష్యానుగురించి బాగా తెలిసినవారు గూడా ఎంతసేపూ పదేళ్లనాటి ఆపాతగాధలనే తీసుకువస్తారుగాని, నిన్నా మొన్నా రష్యాసాంఘిక, ఆర్థిక, రాజకీయరంగాలలో జరిగిన విపరీత పరివర్తనలనుగురించి వారికేమీ తెలియదు.

1917 కార్మికవిప్లవాన్ని పొగడే తెగడేవారి ధోరణిలో కలిగినమార్పును బట్టిచూస్తే విప్లవాదర్శాలకు విరుద్ధంగా రష్యాలో ఏదో గొప్పమార్పుకలిగినట్టు గోచరమవుతూవుంది. ఉదాహరణగా-ఇంగ్లండు బూర్జువా కన్సర్వేటివులనూ, రష్యాసామ్యవాద బోల్షివిక్కులనూ ఒకవిధంగానే నీచాతినీచంగా వ్యాఖ్యానించారు. అసహ్యకరమైన విశేషణాలతో వర్ణించారు. అపహాస్యమైన వ్యంగ్య చిత్రాలను గీచారు. లండన్ 'డైలీహెరాల్డు' పత్రిక రష్యాదేశాన్ని గడ్డంమీద పంది ముళ్ళలాంటి బొచ్చుతోనున్న భూతంలాగ వ్యంగ్యచిత్రాన్ని ప్రచు

రించింది. సోవియట్ పరిపాలనను తెగడేవారిలో చర్చిల్ మహాశయుడొకడు. రష్యామీద సైనికదాడి జరపటానికి ఎత్తులు కూడావేశాడు. కాని 'రష్యాజోలికి పోవద్దు' అనునినాదముతో బ్రిటిషు ట్రేడు యూనియను వారు చేసిన అందోళన ఫలితంగా చర్చిలుగారు తన ఈఎత్తులను దిగమింగవలసివచ్చింది. ఆచర్చిలు మహాశయుడే నేడు కామ్రేడ్ స్టాలిన్‌నూ, అతని సోవియట్ ప్రభుత్వాన్నీ తెగపొగడుతున్నాడు. కాబట్టే పార్లమెంటులోని సోషలిష్టు సభ్యుడొకడు 'చర్చిల్ స్టాలిన్‌కు భట్రాజు' అవుతు న్నాడన్నాడు కామనున్సు సభలో. మరోవైపున రష్యా విప్లవము మానవస్వాతంత్ర్యానికి మహాదర్శమనీ, సోవియట్ యూనియన్ ప్రపంచ కార్మికులకు ఆశాజ్యోతియనీ మిన్ను ముట్టపొగడిన నాబోటి సామ్యవాదులున్నారు. ఫ్రెంచి విప్లవాన్ని గురించి మహాకవి వర్డ్సువర్తు పాడినరీతిగానే మేము కూడా 'ఆ సుప్రభాతాన బ్రతికియుండటం బ్రహ్మానంద'మని పాడగలము.

కాని నేడు మేము ఆ విప్లవ ఫలితాలలోని భ్రమలను మభ్యపరచి వుంచలేము. బహుకాలంగా సోవియట్ జీవితాన్ని గడపీనవారూ, రష్యా విప్లవాన్ని సమర్థించిన లూయీఫిషర్ (Men and Politics), మాక్సు ఈష్టమన్ (Stalin's Russia & the Crisis in Socialism), ఎగెన్‌లాయన్సు (Assignment In Utopi ). ఫ్రెడా అట్లీ (The dream we lost) అంద్రేగైడ్ (Return from The U. S. S. R. and Afterthought's on the U. S. S. R.) లాంటి ప్రముఖ వ్యక్తులుకొందరున్నారు. కాని వారు చాలా అరుదు. కాని లెనిన్ ట్రాటస్కీలకు మిత్రుడూ, రష్యావిప్లవాన్ని సమర్థించిన

ఘనుడునైన మార్క్సిఈస్టమెన్ నేటి రష్యా ప్రభుత్వాన్ని గురించిచేసిన విమర్శలకు కన్సర్వేటివ్వైన హెరాల్డు నికెల్సన్ కూడా వ్యతిరేకించడంలో ఏదో అంతరార్థము లేకపోలేదు.!

## మా రి న ది ఎ వ రు ?

ఈ పరిపూర్ణ పరివర్తనకు కారణమేమి ? ఇద్దరిలో ఎవరు మారారు ? మారింది చర్చిలా ? ఈ సోషలిస్టులా ? లేకపోతే గత ఇరవై సంవత్సరాలలోనూ రష్యాదేశమే మారిందా ? మరొకసారి వెనుకకు మరలి 1917 పరిస్థితులను పరికిద్దాము. నాటి విప్లవం ఎందుకు వచ్చింది? దాని లక్ష్యమేమిటి ? అప్పుడు రష్యా నిరంకుశ జారు పరిపాలన కిందవున్నది. రైతులు, కూలీలు శోచనీయమైన స్థితిలో వుండిరి. సైనికుల గతి మరింత దుర్భరముగా యుండెను. లెనిన్, ట్రాటస్కీలు 'శాంతీ, భూమి, ఆహారం' అను నినాదాలతో అక్టోబరు 1917 విప్లవాన్ని లేవదీశారు. సైనికులకుశాంతీ, రైతులకుభూమి, కూలీలకు ఆహారము కావలసియుండెను. ఫ్రెంచివిప్లవంలాగ ఇది రాజకీయ విప్లవం మాత్రమేకాక ప్రపంచవిప్లవాలకు నాందియైన సాంఘిక విప్లవం కూడాను. బోల్షివిక్ నాయకులు జారు ప్రభుత్వంతో పాటు పెట్టుబడి దారీ విధానాన్ని కూడా నిర్మూలించి సామ్యవాద ప్రభుత్వాన్ని స్థాపిస్తామని ప్రకటించారు. దానినే లెనిను 'సమానప్రతిపత్తిగల స్వాతంత్రసంఘస్థాపన యని' వర్ణించాడు. దానినే సోషలిస్టులు, కమ్యూనిస్టులు మరో మాటల్లో వర్గరహితమైన అంతర్జాతీయ ప్రజాస్వామిక సంఘంగా వుంటుందని భావించారు. దానికి అనుగుణ్యాంగా వ్యక్తిగత పుటాస్తిని నిర్మూలించాలనీ, గనులూ, మిల్లులూ యజమానులవద్దనుండి లాక్కొని

ప్రజాసామాన్యమంతా అనుభవించటానికి కార్మికుల ఆధీనంలో వుండునట్లుగా ప్రభుత్వ వశం చేయబడాలనీ నిర్ణయించారు. సైన్యములో పదవీభేదములు నిర్మూలించబడినవి. మహిళలను కూడా ఉద్ధరించి పురుషులతో సమానమైనటువంటి హక్కు-భుక్తములుండునట్లు, పిల్లలందరికీ విద్యనభ్యసించటానికి సమానావకాశాలుండునట్లు, విద్యాలయ పాలనాబాధ్యతంతా వారే వహించునట్లు ప్రకటించారు. రాజకీయాధికారమంతా కమ్యూనిష్టు పార్టీ హస్తగతమైంది. వ్యక్తిగతపుటాస్తి అంతమై వర్గరహిత సమాజమేర్పడిన తర్వాత ఈ నియంతృత్వము నిర్మూలమై పరిపూర్ణ ప్రజాస్వామికము వస్తుందని వారు ప్రకటించారు. 'వంట లక్క' కూడా రాజ్యాంగ యంత్రమును నడపుట నేర్చుకోవాలన్నాడు లెనిన్. అంటే ప్రభుత్వంగానీ, పోలీసులుగానీ అవసరం లేకుండా ప్రతివాడూ సోదర భావంతో అన్యోన్యతగా వుండాలన్న మాట. లెనిన్ ఎంగిల్సును అనుసరిస్తూ 'ప్రభుత్వాలు నశించినాసరే- శక్తికొలదీ శ్రమపడి అవసరం కొద్దీ తీసుకొనుట జీవిత హక్కు అని ప్రతివారూ గుర్తించిరి. ఇక వారు శాశ్వత సౌఖ్య మనుభవిస్తారు' అన్నాడు.

## 1927

కాని అలా జరిగిందా? నేను రష్యాకు వెళ్ళి అక్కడి యదార్థములను తెలుసుకొనుటకు ప్రయత్నించాను. 1927, 35 సంవత్సరాలలో అనతికాలంగా రష్యాలో వుండే భాగ్యం నాకు లభించింది. సౌభాతృత్వమూ, అంతర్జాతీయ భావము సున్నేహాలాలసతో నిండియున్న అచ్చటి వాతావరణానికీ, ఇండియా ఇంగ్లండులలో గల వాతావరణాలకీ గల తార

తమ్మాలను గుర్తించటంలో నేనేమీ పొరపడలేదు. రంగు జాతుల వారికి అచ్చట ప్రత్యేకాదరము కలదు. 'నేను మానవునిగా భావించబడుతున్న దేశ మిదొక్కటే'నని కన్నీరు కార్చుతూ ఒక నీగ్రో యువకుడన్నమాటలు నాకింత వరకు జ్ఞాపకమున్నాయి. స్టాలిన్ ట్రాట్స్కీ వివాదములు అప్పటికే స్ఫురిమించి రాగాన పడ్డాయి. కాని అంతవరకు పత్రికా ముఖమునే జరుగుతున్నాయేగాని, రష్యన్ గూఢచారిశాఖ(G.P.U) ధూర్తదృష్టిలో పడలేదు. స్టాలిన్ ప్రభుత్వ యంత్రాన్ని స్వాధీన పర్చుకో గలిగాడు. శ్రమిక వర్గమునకు ప్రేమ పాత్రుడైన ట్రాట్స్కీ ప్రతికక్షిగా నిలబడి పోరాడ వలసి వచ్చెను. పాశ్చాత్య నాగరికతను బట్టి చూస్తే భవిష్యదాశతో సామ్యవాద సంఘస్థాపన కోసం భౌతిక సౌఖ్యం లేకపోయినా పట్టు వదలని సమయాలున్నాయి.

నేను చూచిన కర్మాగారాలలో కార్మికులు ఆధిపత్యమే వాస్తవిక విషయముగా నుండెను. ఆ ఫీసులో ఇద్దరు వ్యక్తులు కూర్చుని యున్నారు. ఒకడు డైరెక్టరు, మరొకడు 'రెడ్' అనబడే కార్మిక ప్రతినిధి. మొదటివ్యక్తి విజ్ఞానవేత్త. రెండవ వ్యక్తి కార్మికులచే ఎన్నుకొనబడిన ప్రతినిధి. ఈ ప్రతినిధి అనుమతి లేకుండా కార్మికులు చేయుపని గానీ, గంటలుగానీ మార్పు చెయ్యటానికి వీలులేదు.

విద్యావిధానంలో కూడా అద్భుతమైన అభివృద్ధి కలిగెను. సైనికజాతికీ, పోటాపోటీలకు దారి చూపించే పరీక్షలు, యూనిఫారమ్ను రద్దు చేయబడెను. ఉపాధ్యాయులు, విద్యార్థులతో కూడుకొన్న స్కూలు కోర్టులలో ఉపాధ్యాయులు విచారణలు జరుపబడు చుండిరి. జాన్ డ్యూవే 1920 సం॥లో రష్యా

విద్యా విధానాన్ని చూచి పులకితుడై 'దానిని వర్ణించటానికి నాకు చాలినంత భాషా పాండిత్యం లేదన్నాడు,

స్త్రీ స్వాతంత్రము, జీవితావసరము లన్నిటిలోనూ పురుషులతోపాటు సంపూర్ణమైన సమాన ప్రతిపత్తి కలిగి యుండటమే అక్టోబరు విప్లవముయొక్క ఉన్నతాదర్శాలలో ఒకటి. ట్రాటస్కీ చెల్లెలు- కామ్రేడ్ కామనేవ్ కు భార్యయైన మేడమ్ కామనేవ్ 'పశ్చిమ యూరపు వలన భారతీయులకు కలిగిన పరిస్థితులవలె గాక విప్లవ మూలంగా తాము చాల వుద్ధరించ బడితిమని' స్త్రీల తరఫున ప్రతినిధిలాగ నాతో అన్నట్టు జ్ఞాపకం. భర్తతోపాటు భార్యకుకూడా ఆర్థిక, సాంఘిక విషయాలలో పూర్తి స్వాతంత్ర్య ముండునట్లు వివాహ, విడాకులాది చట్టాలు సమూలంగా సంస్కరించ బడ్డాయి. స్త్రీ ఆరోగ్యానికి సంబంధించిన గర్భ స్రావములు చట్ట బద్ధము చేయబడెను. సంతాన నిరోధాన్ని గురించి ప్రభుత్వము ద్వారా ప్రచారము చేయ బడుచుండెను.

లెనిన్ జారుప్రభుత్వముతోపాటు ప్రభుత్వపు ప్రాపకం పొందిన సనాతన క్రైస్తవ దేవాలయాన్ని నాశనంచేసి 'మతము మత్తుమందులాంటి'దని చెప్పాడు. అది 1927 నాటి సోవియట్ రష్యా పరిస్థితి.

## 1935

1935 లో నేను మళ్లా రష్యా వెళ్లి చూచేప్పటికి అక్కడి పరిస్థిలు తారుమారైనట్లుగా కనిపించాయి. పంచవర్ష ప్రణాళిక కార్యరూపముజెందెను. కొంతఅభివృద్ధి కూడా కనపడింది. కాని మరి యొకవంక కమ్యూనిష్టు పార్టీలో

ప్రజా స్వామికానికి బదులు వ్యక్తి నియంతృత్వము అమలు లోనికి వచ్చెను. ప్రజాసంస్థలలో పాటు లెనిన్ చిత్రాలు స్టాలిన్ చిత్రాల నీడలో ప్రేలాడ వలసి వచ్చెను. ఎమ్. వి. డి. (నాజీ టెక్నిక్‌తో తయారు చేయబడిన జర్మన్ గెస్టపో శాఖ వంటిది, మన సి. ఐ. డి. శాఖను సరిపోలినది) శాఖ ప్రాముఖ్యత వహించెను. అంతర్జాతీయ భాతృత్వము అంతరించి పోయెను. రష్యన్ ప్రజా సామాన్యానికి విరుద్ధంగా జరుగుచున్న నిరంకుశత్వమునకు ప్రమాణములు చాల కనపడుచుండెను. ఇది ముఖ్యంగా రాజధాని నగరమైన మాస్కోలో ప్రస్ఫుటమగుచుండెను. అజర్బయిజన్ (టర్కీ) అర్మేనియన్ లాంటి [illegible] ప్రభుత్వాలలో మాత్రం ఇంకా ప్రాచీన [illegible] అంటి పెట్టుకునే వున్నాయి.

ఈసారి నేను చూచిన వ్యక్తులలో ఆ [illegible] లేరు. వారిని తీసివేశారనివిన్నాను. ఈ మధ్య సంవత్సరములలో కార్మిక కుల ప్రజాస్వామికము నామ మాత్రావశిష్టమయ్యెను. దానికి బదులుగా స్టెకనొవిజమ్ అనబడే కేపిటలిస్టు భాషలో మనం మనుకునే 'పీస్ వర్కు' కనపడింది. కార్మికులు ఒకరితో [illegible] పోటీలుపడి అధిక శ్రమకు లోనయ్యేట్లు చేయువిధానమే యిది. దాని ఫలితంగా సామాన్యశక్తి సామర్థ్యాలున్న కార్మికులకన్న స్టెకనొవిస్టుకు అధిక పరిశ్రమచేసి అయిదునుండి పది రెట్లు వరకు సంపాయించు అవకాశమేర్పడెను.

పాఠశాలలో స్వపరిపాలన రూపుమాసిపోయెను. ప్రష్యా లాంటి క్రమ శిక్షణ అవతరించెను పరీక్షలు, యూనిఫారమున్న మరల అమలులోనికివచ్చెను. 'ప్రమాదకరమైన ఆలోచనలు' అను నెపముతో జపానువారు నిషేధించుచున్నట్లు [illegible]

స్కూళ్ళలోనూ, బైటా విద్యార్థుల సంభాషణలనూ, ఆచరణనూ కనిపెట్టియుండుటకు యువజనకమ్యూనిస్టులీగు నియమించబడెను. జాన్‌డ్యూవేపాగడ్తలంతా వ్యర్థమయ్యెను.

సాంఘిక స్థితిలో హిట్లర్ ముసోలినీల శీతవాయులు తగిలెను. విడాకులు దుర్భరమయ్యెను. గర్భస్రావములు మరల చట్టవిరుద్ధముచేయబడెను. సంతాన నిరోధము కోపదృష్టికి గురియయ్యెను ఇంకాపైగా పదకొండుగురు సంతానమునుగన్న ప్రతి కుటుంబమునకూ బహుమతులీయబడునని పత్రికలలో ప్రకటన లగపడుచుండెను. నలువైపులనుండి నాలుకలు చాచుకు వస్తున్నరణదేవతకోసం సామ్యవాద పితృభూమి తుపాకుల మందుకోసం ఆతృత పడసాగెను.

ప్రతినిరంకుశ ప్రభుత్వానికీ ఎల్లప్పుడూ సత్యము ప్రథమ దైవికము. ప్రత్యర్థి పక్షమును చితుకగొట్టి, ట్రాటస్కీనిదేశభ్రష్టునిగావించి సోవియట్ ప్రభుత్వము చరిత్రను తిరిగివ్రాయించసాగెను. జర్మనీలో లాగ పుస్తకములను బహిరంగంగా తగులబెట్టలేదు గాని, తమకు వ్యతిరేకమనుకున్న పుస్తకములను గ్రంథాలయములనుండి తొలగించారు. చరిత్రను బలిచేసి అప్రధాన విషయాలకు ప్రాధాన్యతనిస్తూ నూతనపాఠ్యగ్రంథములు వ్రాయబడెను. అలాంటిబలులకు గురియైనవాటిలో జాన్‌రీడ్ వ్రాసిన 'ప్రపంచాన్ని కంపింపజేసిన పదిరోజులు' (Ten days That-Shock the World) అను విప్లవ చరిత్రఒకటి. దానిలోని యదార్థతను గురించి లెనిన్‌పొగడాడుకూడా. దానిలోనున్న పొరపా టేమిటంటే లెనిన్‌తో పాటు మాటిమాటికీ ట్రాటస్కీనికూడా తలచి, విప్లవములో అనామకుడైన స్టాలిన్ పేరెత్తకుండుటయే!

నేను మాస్కోలోని రెడ్ ఆర్మీభవనంలో చిత్రపట భాగాన్ని చుట్టివచ్చాను. అక్కడ గృహాయుద్ధ చరిత్రలు, విప్లవానంతరం విదేశీయ దండయాత్రలకు విరుద్ధంగా జరిగిన యుద్ధగాథలు చిత్రములుగా గీయబడినాయి, చరిత్రలుగా వ్రాయబడి వున్నాయి. అందు వొరిషిలోవ్, బడానీ, బ్లచర్ లాంటి సైనికాధికారుల చిత్రాలే కనపడ్డాయిగాని, రెడ్ ఆర్మీ నిర్మాత- విప్లవ విజయ సంధాత- ప్రజానేత ట్రాటస్కీ చిత్రం ఏమూలా అంతులేదు! ట్రాటస్కీని వదలివేశారని చెప్పుటకు వింతగా వున్నది. నారష్యన్ మిత్రు నొకనిని కారణమడిగాను. "అది నిజమేగాని..." రష్యన్ మిత్రుడు నిర్భయంగా అన్నాడు "ట్రాటస్కీ విప్లవ వ్యతిరేకియై తాను విప్లవమునకు చేసిన కృషి నంతనూ వ్యర్థపరచినాడు. కాబట్టి అతడు లేనివారిలో లెక్కే!"

1927 సం॥నాటి పత్రికల-వుత్సాహములస్థానే ఛిద్రాన్వేషణ, అసత్య ప్రచారంపుట్టి పెంపొందుటకు ఈ మార్పులు కారణమయాయి. 'ప్రవడా' (నిజం)లో వార్తలువుండవు, 'ఇజవెస్టియా' (వార్తల)లో నిజంవుండదన్న పుకారుకూడావుంది మాస్కోలో!

నేను ప్రయాసతోను, కలవరపాటుతోనూ రష్యానుండి మరలివచ్చాను. కాని నిరాశ జెందలేదు. ఎందుచేతనంటే నా ఆకాంక్షలు, నమ్మకాలు ఇంకా బలంగానే వున్నాయి. మత దురభిమానమున్న వ్యక్తి తన నమ్మకములు సడలిన కొలదీ వాటినే మరింత గట్టి పట్టుతో అంటిపెట్టుకొని యున్నట్లు నా సంశయాలనూ, సందేహాలనూ హృదయంలో అణచిపెట్టుకొని చాల కాలంవరకు నేను బహిరంగంగా సోవియట్ కార్యక్రమాలను పొగడుతునే యున్నాను. కాని అది పొరపాటని నాకిప్పుడు తెలిసి వచ్చినది.

రాజకీయ జీవితంతో సోవియట్ రష్యాకు వెళ్ళుటకు అనుమతి నందిన కమ్యూనిస్టుకాని భారతీయులలో నే నాఖరువాడ ననుకుంటాను. ఈదారి త్రొక్కింది బ్రిటిషు ప్రభుత్వముకాదు. తన దేశము చుట్టూ పసికట్టుకు కూర్చున్న విదేశ సోషలిస్టులను ఎంతమాత్రమూ రానియ్య నిచ్చగించని సోవియట్ ప్రభుత్వము మాత్రమే! 1938 సంIIలో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ సోవియట్ రష్యాకు వెళ్ళటానికి అనుమతికై లండన్‌లో వేచి వేచి అప్పట్లో దొరక్క పోయేటప్పటికి విసుగుతో యింటికి మరలి వచ్చాడు. ఈ సంగతి అందరికీ తెలియదనుకుంటాను. ఇలా నిరాకరింపబడిన వారిలో యూసఫ్ మెహరాలీ, పురుషోత్తమ త్రికుందాస్, ఆచార్య. ఎం ఎల్. దంతవాలా లాంటివారు మరి కొందరున్నారు.

అప్పటికే మొలకలెత్తిన కొన్ని అవగుణములు 1935 నుండి పెంపొంది రష్యాను సామ్యవాదమునుండి ధూరంగా ఈడ్చుకు పోసాగినై. రష్యన్ రాజ్యచక్రము కొన్ని ఘట్టములలో జారు పరిపాలనను జ్ఞప్తికి తెచ్చునంత విసురుగా తిరిగెను.

## పెచ్చు పెరుగుతున్న హెచ్చుతగ్గులు

సాంఘికార్థిక వ్యత్యాసాలు పెచ్చు పెరుగుటవలన సామ్యవాద యంత్రంలో అంతరంగికంగా మార్పులు రాసాగెను. హెచ్చుతగ్గులు పెచ్చుపెరుగకుండా ఏర్పరుపబడిన నిర్బంధములు ఒకదాని వెనుక నొకటి సడలిపోసాగెను. దానిలో సంఘసభ్యుల గరిష్ఠాదాయ ప్రమాణమొకటి. పార్టీసభ్యులు ఒక నియమితమొత్తమునకు మించినజీతములు తీసుకొనరాదు అను నియమమును తనకు మాలిన ధర్మముగా జమకట్టిరి. ప్రతివాడూ తన కుమారు

నికి ఒక నిశ్చిత మొత్తముకన్న ఎక్కువ ఇవ్వగూడదన్న నియమంకూడా మొన్ననే తొలగించి వేయబడింది. దాని ఫలితంగా చాలమంది తన కష్టార్జితంమీద ఆధారపడ నవుసరం లేకుండా అధికసంపదలకు వారసులై పెట్టుబడిదారీ సమాజములోవలె పరులసంపదలతో బ్రతుకుచూ సోమరిపోతులుగా తయారగుచున్నారు.

ఈ యుద్ధం ప్రారంభమైన తర్వాత రష్యాలో ఏర్పడిన హెచ్చుతగ్గులు పెట్టుబడిదారీ దేశంగా అభివృద్ధి జెందిన అమెరికా కంటె తక్కువేమీ కాదు! 1935 నవంబరు 6 వ తేదీన 'ప్రవడా' పత్రిక సోవియట్ గనులలో పనిచేయు సామాన్యకూలీ 4, 5 వందల రూబుల్సు మాత్రమే గడించుచుండగా స్టెకనో విస్టుకూలీ 1600 రూబుల్సును అతిక్రమించుచున్నాడని వ్రాసింది. 170 రూబుల్సు సంపాయించు సామాన్యకూలీ స్టెకనొవ్ అయిన యెడల 400 రూబుల్సు సంపాయించుచుండెను. గనులలో పనిచేయు ఒకకూలీ తన తోటికూలీకన్న పదిరెట్లు అధికముగా సంపాయించుటకు అవకాశాలున్నాయి. ఇంజనీయర్లు, ప్రత్యేకనిపుణుల జీతములు సాధారణ కూలీకన్న ఎనభైరెట్లు అధికముగయుండెను. పిల్నియాక్ అను ప్రసిద్ధరచయిత నెలకు 30,000 రూబుల్సు వేతనము పొందుచున్నాడు. ఎవరూ స్వంతంగా ఒక ఫ్యాక్టరీనిగాని, గనినిగాని, రైల్వేనిగాని వుంచుకొన వీలులేకపోయినప్పటికీ ఇప్పుడు రష్యా ప్రజలు నూటికి 7 రూబుల్సు వడ్డీతో యిష్టమొచ్చినట్లు ప్రభుత్వపు బాండ్లను కొననవకాశమున్నది. తమకు వచ్చుచున్న హెచ్చు వేతనములలో మిగుల్చుకొన్నవారు ఒక క్రొత్తవర్గముగా ఏర్పడి పెట్టుబడిదారీ సంఘములోవలె వడ్డీవ్యాపారము చేయసాగారు

వీరే ప్రభుత్వయంత్రమును నడుపు వారుగనూ, పెద్ద పెద్ద వ్యాపార సంస్థలకు అధికారులుగను వుండుటచే ఇప్పుడు రష్యాలో ఒక క్రొత్తరకపు పరిపాలకవర్గము తల ఎత్తుచున్నదని ప్రతివాడూ చెప్పవచ్చును. ఈ క్రొత్త రకపు వర్గమునకు చెందిన వారు తమకు తాముగా ఒక ఫ్యాక్టరీనిగాని, ఒకవ్యాపారమును గాని కలిగియుండరు గాని జాతీయాదాయ మంతటిలోను భాగ స్వాములై యుంటారు.

ఈ విభేదములు రెండు ప్రభుత్వములలోనూ ఉన్నప్పటికీ వాటివల్ల కలుగు ఫలితాంశములు మాత్రం విభిన్నములు కాజాలవు. ఇది ధనికవర్గపు దోపిడీకాదుగాని మరొక రకమైన అలాంటి దోపిడీ యనియే కచ్చితంగా చెప్పవచ్చును. ప్రాచీన కాలంలో మతగురువులు ప్రభుత్వముద్వారా ప్రజలను దోపిడీ చేయుచుండెడివారు. వారు పెట్టుబడిదారులూ, సామ్యవాదులు కాకపోయినా అలాంటి ప్రభుత్వాలను మనం సామ్యవాద ప్రభుత్వాలని పిలువగలమా!

ఇటీవల 'టైమ్' పత్రిక మాల్టావ్‌ను గురించి వ్రాస్తూ స్టాలిన్ కృపాకటాక్ష వీక్షణములతో అదృష్టవంతు డయూ డనీ, మానవమాత్రుడు పొందగలవున్నత పదవి రష్యాలో అంతకన్న లేదనీఅన్నది. యితెల్ మేనక్ అను ప్రఖ్యాత ఆంగ్లరచయిత్రి రష్యాలో కల్లా భాగ్యవంతురాలైన మాల్టావ్ భార్యను సందర్శించ బోయెను. అప్పుడు ఆమె రష్యా సుగంధవ్యాపార సంస్థకు ధర్మకర్త. ఆమె ఇంటి భోగభాగ్యములకును, ఆపరగణకు పల పందుల గుంటలలో నివసించు ఆమె ఇంటి నౌకరుల ఇండ్లలో నున్న పేదరికానికినీ గల వ్యత్యాసములను చూచి ఆ రచయిత్రి భయకంపితురాలై పోయింది!

"ఈమధ్య కొంత కాలంనుండి రష్యాప్రభుత్వము పురుషుల చేత వారానికి 84 గంటలు, స్త్రీలచేత 66 గంటలు, పిల్లలచేత పెద్దవారికంటె కఠినంగానూ పని చేయించుచున్నది" (టైమ్ - 6 సెప్టెంబరు 1943) కొంతకాలం క్రిందట రెజినాల్డు సారెన్సన్ కామన్సు సభలో భారతీయ స్త్రీలు గనులలో పని చేయ నిరాకరించునపుడు కన్సర్వేటివు సభ్యుడొకడు సామ్యవాద పితృ భూమిలో గనులలో స్త్రీలుకూడా పని చేయుచున్నారని పరి హాసంగా అన్నాడు.

## సహవిద్య నిర్మూలన

ఆర్థిక స్థితిలో కలిగిన అస్తవ్యస్తములతో పాటే సాంఘి కాభివృద్ధికి కూడా నిరోధములు వచ్చుచుండెను. స్వాతంత్ర్య ప్రాంతాలలోని పాఠశాలలలో సహవిద్య ఎత్తివేయబడినదని 1943 సంవత్సరాంతాన రష్యానుండి వార్తలు వచ్చాయి. ఇది అత్యల్ప విషయమైనా శ్రద్ధ వహించి చూడదగింది కూడాను.! ఈ మార్పును సమర్థించుటకు బాలురు సైనికులుగానూ, బాలి కలు తల్లులుగానూ తయారు కావటానికి బాల బాలికలకు ప్రత్యేకంగా ఇలాంటి విద్య నివ్వ నవసర మేర్పడిందని చెప్పారు.

సాంఘిక జీవితంలో ముఖ్యంగా గమనించవలసిన మార్పు లలో మరొకటి మతమును గురించినది. 'మతము మత్తుమందు లాంటిది' అని లెనిన్ చెప్పిన మతమే మరల పునరుద్ధరింప బడెను. ఒకప్పుడు నెపోలియన్ 'మతము లేకుండా ప్రజలను పాలించేదెలా?' అని ప్రశ్నించాడు. అదే స్థితిలో నేడు స్టాలిన్, జారు రాజ్యంతో సంబంధమున్నదని విప్లవానంతరం మూయిం చిన సనాతన క్రైస్తవదేవాలయాలను తిరిగి తెరపించి ఆప్రశ్నకు సమాధాన మిస్తున్నాడు.

## జి. పి. యు.

కార్మిక నియంతృత్వ ఫలితంగా ప్రజలయొక్క ప్రతి స్వాతంత్ర్యమూ హరించబడెను. వారు శిబిర సైనికులవలె చేతులు కట్టుకుని నిలబడవలసి వచ్చెను. ఈ నియంతృత్వము కమ్యూనిష్టుపార్టీది కూడా కాకుండా క్రూరాతి క్రూరమైన జిత్తులమారి రహస్య పోలీసుశాఖ 'జి. పి. యు' చేతిలో నున్న ఒక నాయకునిదై యున్నది. దాని ననుసరించే హిట్లరు తన గెస్టపో శాఖను నిర్మించాడు.

తమ భూములను ఇవ్వ నిచ్ఛగింపని 70 లక్షలమంది పెద్ద రైతులు, దాదాపు లక్షమంది రాజకీయ ప్రత్యర్థులు, స్టాలిన్, కాలినిన్, వొరూషివ్ లో లాంటివారుతప్ప విప్లవంలో పాల్గొన్న ప్రతి ప్రఖ్యాత కమ్యూనిష్టు జి. పి. యు. ధూర్తదృష్టికి గురియైన వాడే. ఆర్థర్ కెయిష్టలెర్ గొప్ప కళాకౌశలాన్నీ, గాఢమైన అంతర్దృష్టినీ, పగటి చీకటికంటే రష్యన్ సంస్కరణల మీద, విచారాలమీద తన దృష్టిని నిల్పలేక పోయాడు! 'నియంతలు అమాయక ప్రజలనుండి ఒడిచిన రక్తమును కొలచి చూచినచో స్టాలిన్‌ది చెరువులోనికీ, హిట్లరుది కొలనులోనికీ, ముసోలినిది గుంటలోకీ సరిపోతుందని' అన్న మాక్సఈష్టమేన్ నిర్ణయము ను ఎదిరించలేము.

రష్యాలో స్టాలిన్‌ను 'వాజ్డ' అని పిలుస్తారు. అంటే నాయకుడు అని అర్థము. జాన్ జోసెఫ్ యి. డేవిస్ అను అమెరికా రాయబారి, స్టాలిన్ మిత్రుడూ తన 'నా మాస్కో రాయబారము' అను పుస్తకములో 'ఇక్కడ ప్రభుత్వ మనగా ఒకే వ్యక్తి - స్టాలిన్. అతి బలవంతుడు. పోటీని పట్టి

కొట్టించిన శక్తి సంపన్నుడూను. ప్రత్యర్థులను తొలగించి ప్రభుత్వము నేలుచున్నాడు. మన మనుకొన్నట్టు ఇది కార్మిక నియంతృత్వము కాదు. కార్మికులమీద నియంతృత్వము. ఇదంతా ఒక్క వ్యక్తి హస్తగతమై యున్నది' అని వ్రాశాడు.

హిట్లర్ విధాన మెంతవరకు రష్యా అమలులో పెట్టుచున్నదో తెలుసుకొనుటకు అండ్రెగైడ్ రష్యాను చూచుటకు వచ్చినప్పుడు గడించిన అనుభవముల గాథ యొకటి వున్నది. గైడ్ రష్యా ప్రభుత్వ అతిథిగా ఒక చిన్న పట్టణములోవుంటూ తన యజమానికి తంతి యివ్వవలసి 'సర్ స్టాలిన్' అను చిరునామాతో పంపాడు. కాని అది చేరలేదు. 'ఘనమైన లేక ప్రియమైన స్టాలిన్‌గారికి' అని వున్న తంతులనేతప్ప మరో రకమైన తంతులను గానీ, వుత్తరాలను గానీ సోవియట్ పోస్టాఫీసు స్వీకరించని సంగతి అతనికి తెలియదు.

లెనిన్ తన అవసానకాలంలో రోగముతో శక్తిహీనుడై యుండి - భవిష్యత్ప్రమాదమును గుర్తించాడు. తన మరణ శాసనములో స్టాలిన్ మోటువాడనియు, అపనమ్మకస్తుడనియు, చంచల చిత్తుడనియు, జాతీయ దురభిమాని యనియు, క్రూరుడనియు వర్ణించి అతన్ని పార్టీ కార్యదర్శి పదవినుండి తొలగింప సిపార్సు చేశాడు. కాని అప్పటికే కాలం గడచిపోయింది.

ప్రభుత్వాలయొక్క విదేశాంగ నీతిలో ఆంతరంగిక విషయాలు ప్రతిబింబిస్తూ వుంటాయి. సోవియట్ ప్రభుత్వములో కలుగుచున్న మార్పులకు సాక్ష్యముగా వారి విదేశాంగ విధానములో అనేక విషయములు పొడకట్టుచున్నవి. నానాజాతి సమితిని గురించి లెనిన్ 'దొంగల గుంపు' అని చెప్పినాకూడా 1935

లో సోవియట్ ప్రభుత్వము దానిలో చేరి సామ్రాజ్యవాద ప్రభుత్వాలైన ఫ్రెంచి, బ్రిటిష్ దేశాలతో భాగస్వామి యైంది.

1939 లో హిట్లర్ స్టాలిన్‌లు చేసుకున్న సంధనను సరించి పోలెండుమీద దండెత్తి రష్యా జర్మనీతోపాటు భాగము పంచుకొన్నది. 'ఫేసిజమునకు కమ్యూనిజమునకు బద్ధవైరము గదా! హిట్లర్ స్టాలిన్‌లకు ఒడంబడిక ఎలా కుదిరిందని' ఎవరో మాల్టోవ్‌ను ప్రశ్నించగా అది యంతా అభిరుచులను బట్టి యుంటుంది. అని కుండ బద్దలుగొట్టినట్టు సమాధానమిచ్చాడు.

## మరల జాతీయతకు

అంతర్జాతీయ చిహ్నముగా మిగిలిన అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీని రద్దుచేయుటయేగాక 1943 నుండి వారు ఆలాపిస్తున్న అంతర్జాతీయ గీతాలనుకూడా మానివేసి అంతర్జాతీయతకు స్వస్తి చెప్పారు. కొన్ని సంవత్సరముల ప్రయత్న ఫలితమైన ఈచర్యలు తిరిగి జాతీయతకు దారితీయ సాగినై. సామ్యవాద రష్యాలోని విద్యాలయాలలో యుద్ధానికిపూర్వము ప్రవేశపెట్టబడిన 'ప్రాంతీయ భాషలను వదలి రష్యన్ భాషనే చదవాలి' అన్నతీర్మానము కూడా జాతీయతకే దారితీయు చున్నది. దీనివల్ల యుక్రైన్, జార్జియా, టర్కీ, టార్‌టార్, సైబీరియన్ జాతుల మాతృభాషలకు అపచారము జరుగు చుండెను.

ఇప్పుడు మాస్కోలో అంతర్జాతీయ కమ్యూనిష్టు సమావేశములస్థానే అఖండరష్యా ప్రజాసమావేశములు జరుగు చున్నాయి. నెపోలియన్ దండయాత్ర నెదుర్కొన్న సువరోవ్, కుట్జోవ్ లాంటి జారుసైనికవీరులను మరల మిన్నుముట్ట పొగడ

సాగిరి. విప్లవానంతరం కొన్నిరోజులు క్రూరాతి క్రూరుడుగా భావించబడిన పీటరు 1930 అనంతరం సుగుణ సంపన్నుడైన మహాపురుషుడుగా భావించబడుచుండెను. మాస్కోలోని హృదయములేని విదేశపత్రికావిలేఖరులు పీటరులో స్టాలిన్ ప్రతిబింబాన్ని గాంచుటకు ఏమీ వెనుకాడలేదు.

ఒక సైనిక మహాశక్తి జాతీయంగా మారినప్పుడు సామ్రాజ్యవాదిగా మారకుండా వుండటం అసంభవంకాదు. దీనికి సాక్ష్యముగా భవిష్యత్తులో మనకు కావలసినన్ని ఆధారములు లభ్యమౌతాయి. మొన్నఈమధ్య వెండల్ విల్కీ రష్యాకు దానిపరిసరదేశములతో గల సంబంధ మేమని యడుగగా 'అవి మాఆంతరంగిక విషయాలని' ప్రవడాపత్రిక అతని మీాద కారాలు మిరియాలు నూరింది. గత సంవత్సరము విల్కీ ఇండియాను చూడగోరినప్పుడు చర్చిల్ విసరిన రాళ్లకునూ, ఈ విషయాలలో స్టాలిన్ యొక్క 'కపడ్దార్' అన్న బెదరింపుకును గలభేదమేముంది? ఈయుద్ధం 1939 పోలెండు స్వాతంత్ర్యరక్షణ కోసమై ప్రారంభమైంది. కాని దాని అంతము పోలెండు ఆక్రమణతోనే పూర్తికావచ్చు. ఆ పోలెండులోని తూర్పుభాగం రష్యాలో చేరుతుందా లేదా అను దురాశలు మిన్నుముట్టి వున్నాయి. పశ్చిమ పోలెండు, ఇంకా కొన్ని తూర్పుమధ్య యూరపు దేశములూ తమస్వాతంత్ర్య రక్షణకోసం ఆతురతపడ సాగినాయి.

ప్రస్తుతం మాస్కో, లండన్‌లోని పోలిష్ ప్రభుత్వాన్ని 'ఫేసిస్టు ప్రభుత్వ' మని నిందించటంలో నిమగ్నమై యున్నది. పశ్చిమ పోలెండులో కూడా ఒక కీలుబొమ్మ ప్రభుత్వాన్ని స్థాపించుటకు ఇది ప్రాతిపదికయని చెప్పవచ్చును.

ప్రస్తుతమున్న పోలిష్ మంత్రివర్గములో ప్రధానమంత్రి రైతు పార్టీకి చెందినవాడు. అంతర్జాతీయ సోషలిష్టు కార్మికశాఖకు అనుబంధమైన పోలిష్ సోషలిష్టుపార్టీకి ప్రాతినిధ్యం వహిస్తున్న మరిముగ్గురు సోషలిష్టు మంత్రులున్నారు. వీరిలో ఒకరు ఉప ప్రధానిగా కూడా వున్నారు. ఇద్దరు మంత్రులు క్రిష్టియన్ లేబరు పార్టీకి చెందినవారు. ఇద్దరు నేషనల్ డెమాక్రటిక్ పార్టీ ప్రతినిధులు. తక్కిన ముగ్గురూ ఏపార్టీకి చెందనివారు. ఇట్టిమంత్రాంగముతో కూడుకున్న ప్రభుత్వాన్ని ఫాసిష్టు ప్రభుత్వమనటం ఎలా సాధ్యపడునో అర్థంకాకుండావుంది. అభివృద్ధికర సాంఘిక ప్రజాతంత్ర ప్రభుత్వదేశములలో ఒకటియైన ఫిన్‌లాండును కూడా ఫాసిష్టు ముఠాకు అంటగట్టుట పోలిష్ ప్రభుత్వాన్ని, ఫాసిస్టు ప్రభుత్వమన్నట్లే వుంటుంది!

పాప భీతిలేని ఇట్టి దుష్టప్రచారములు రాజ్యములను కలుపుకొనుట కేర్పడిన రాజకీయ తంత్రముల వలె యున్నవి. 20-7-1944 తేదీ లండన్ అబ్జర్వర్ పత్రిక, రష్యా దురాక్రమణను గురించి అనుమానించిన వారిని నిందించుచూ వ్రాసిన ధోరణిలోనే - స్టాలిన్ కూడా తన అవసరముల బట్టి సిద్ధాంతములను మార్చుకుంటున్నా డని - తెలుస్తూవుంది. 'ఈ అవసరముల కొరకే తూర్పు యూరపు రాజ్యములలోని రాజకీయములను తిరిగి సవరింపవలసిన అవసర మేర్పడినదని నొక్కి చెప్పింది.

ఈమధ్య హారీపా లెట్ ఏదో విషయంలో మండిపడి "అమెరికా ఇంగ్లండులను రష్యా పోలెండులకు సంధి కుదర్చమని బ్రిటిషు ప్రజలూ, స్టాలిన్‌ను గాంధీమహాత్మునికీ చర్చిలుకూ రాజీకుదర్చమని రష్యన్ ప్రజలూవత్తిడిచేసి యున్నచో

మెట్లుండెడిదో ఆలోచించుకొమ్మని” బెదరించెను. కాని రష్యా ప్రజలు అలా ఎందుకు చేయలేదో మాత్రం పాపం పాలిట్ గారు చెప్పలేదు. రష్యా సోషలిష్టు దేశమో, కనీసం సామ్రాజ్య వాద వ్యతిరేక దేశమో మై యున్నచో అలాంటి వత్తిడి తెచ్చి యుండెడిదన్న సంగతి పాపం హారీపాలెట్ కు తోచలేదు కామాను! ఇండియా బ్రిటిషువారి కుటుంబ వ్యవహారములకు సంబంధించినదనీ, పోలెండు రష్యావారి అంతరంగిక కార్యాన్ని గురించినదనీ వూహించాడు కామాను!

## మరో రాష్ట్రకూటము

సోవియట్ నిర్మాణంలో ఒక క్రొత్త మార్పువచ్చిందని ఈమధ్య మాస్కోనుండి ఒక ప్రకటన వచ్చింది. సోవియట్ రష్యా తన రాష్ట్రము లన్నిటికీ పూర్తి స్వాతంత్ర్య మిచ్చానని ప్రకటించింది. అంటే యూనియన్ లోని ప్రతి రాష్ట్రమూ విదేశాంగ వ్యవహారాలు స్వతంత్రించి జరుపుకోవచ్చునట. ఆశ్చర్యం ఏమిటంటే ఈ రాష్ట్రములన్నిటికీ స్వయం నిర్ణయాధికారముండి విడిపోవు హక్కు యిచ్చినట్లు ఇదివరకే ప్రకటించారు. ఈ రాష్ట్రములు సిద్ధాంతరీత్యా విడిపోవటానికి హక్కు కలిగి యున్నప్పటికీ - సిద్ధాంతము సిద్ధాంతముగానే యుండిపోయిన దనియూ, దాని నమలులో పెట్టిన యెడల కూట ప్రభుత్వపు కోపదృష్టికి, అంటే స్టాలిన్ కోపదృష్టికి గురి కావలసి వస్తుం దనియు డేవిస్ వ్రాశాడు. కాగితము మీద చట్టముల అస్థిరత్వమునకునూ, జి. పి. యు. వారి భీకరశక్తికిని గల వ్యత్యాస మెంతో గుర్తించిన వారు ఈ స్వయంనిర్ణయ సూత్రమొక తెర యనియు, దాని మరుగున ఇతర రాజ్యములను కలుపుకొను

విధానము అమలులో నున్నదనియు గ్రహించగలరు. ఈ తెరయే లేకపోయినచో ఆ యా దేశములలో దేశభక్తి పూరితమైన తిరుగుబాటు వచ్చుటయేగాక ఇంగ్లాండు అమెరికావంటి దేశములుకూడా తమ స్నేహాలాలసతను త్రోసి రాజనును. ఇంగ్లాండువలెనె రష్యాకూడా ప్రభుత్వాంతర్గత రాజకూటమి గలిగి వాని తరఫున యిచ్చువచ్చినట్లు నాటకమాడవచ్చును. అప్పుడు తానుకూడా ఫిన్‌లాండు ప్రాతినిధ్యమును కుశినిన్‌కు, బల్గేరియా ప్రాతినిధ్యమును డిమిట్రాఫ్‌కును కట్టబెట్టి చర్చిల్ మహాశయుడు కాదన్నచో ఇండియా తరపున రామస్వామి మొదలియారు, సర్ ఉస్మానీ ఎట్లు పనికి వచ్చునని అడ్డుసవాలు వేయుటకు సిద్ధపడగలరు.

1944 ఫిబ్రవరి 5 వ తేదీన లండన్ ఎకనమిస్టు పత్రిక మిత్రరాజ్యాలను గురించి రాయవలసి వచ్చినపుడు చూపవలసినంత ఆదరం చూపెట్టి "మార్షల్ స్టాలినూ, మిష్టర్ మాల్టావూ యదార్థములనుండి తమ దృష్టి తిప్పుకున్నారు. వారి పదహారు రాష్ట్రములు కారణములగపడక ఒకదాని కెదురుగా ఒకటి నిలబడి పోయాయి. 1938 లో తమకు చెందని ఇతర ప్రాంతములను తమ దేశములో చేర్చుకొని నప్పుడు బాహ్యప్రపంచం సులువుగా అంగీకరించుటకు ఈ విధానము పనికి వచ్చుచున్నది" అని వ్రాసింది.

ఆ కిందటి రోజునే (4-2-44) టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక తలవని తలంపుగా తన సంపాదకీయంలో "నిజమాలోచించినచో బ్రిటిషు రాష్ట్రకూటముల వలెనే అదే పద్ధతులమీద రష్యనులుకూడా సోవియట్ రాష్ట్రకూటమి నొకదాన్ని ఏర్పరచ దలచినట్లు అర్థమౌతూవుంది. రాష్ట్రకూట విధానాన్ని

పరిచారం చేసిన బ్రిటిషువారు ఈ రష్యా నిర్ణయాన్ని పొగడ వచ్చు” అని వ్రాసింది.

‘నాజీ దురాక్రమణ నెదుర్కొని తన్నుతాను రక్షించుకొను ప్రయత్నములో రష్యా ఆంతరంగిక, విదేశాంగ వ్యవహారములలో యీాదృశదృష్ట పరిస్థితులు సంభవించక తప్పదనియు, యుద్ధానంతరము సామ్యవాద సమాజ నిర్మాణమునకు మరల దొరకొనుననియు కొందరు చెప్పుచున్నారు. ఆశయములలో సామ్యవాదముపట్ల ఆదరము చూపుచూ ఆచరణములో అందుకు భిన్నమైన మితవాద పక్ష కార్యక్రమములో చేతులుకలిపి గత ఎనిమిది సంవత్సరములనుండి నడచినట్లే రష్యా ప్రభుత్వము ఇకముందుకూడా నడువగలదనే నా నమ్మకము’ అని రాసాడు డేవిస్.

## సామ్యవాదియా? ధనికవాదియా?

కేవలం మందబుద్ధులు తప్ప మరెవ్వరూ నేటిరష్యాను సామ్యవాద ప్రభుత్వ మని పిలువజాలరు. సామ్యవాద సమాజమున కుండవలసిన మూడు ముఖ్యలక్షణములలో దానికి ఒకటీ లేదు. అది వర్గరహిత సమాజంగానీ, ప్రజాస్వామిక ప్రభుత్వంగానీ, అంతర్జాతీయ సంస్థగానీ కాదు. అందువలన సోవియట్ ప్రభుత్వము సాధించిన ఘనకార్యములే లేవని చెప్పజాలము. దేశాన్ని పారిశ్రామికమయం చేసింది. అద్భుతమైన వ్యవసాయాభివృద్ధి చేసింది. ఇతర దేశములు చేయ సాహసించ లేనంత సంస్కరణల చేసింది. కాని వీటిలో వేటినీకూడా సామ్యవాద పద్ధతులమీాద పెట్టలేదు. బలీయమైన కేపిటలిష్టు ప్రభుత్వాలకూ ఫేసిష్టు రాజ్యాలకు కూడా ఇవియే ప్రధానాంశములు. సోవియట్

ప్రభుత్వము ఆచరణలో సామ్యవాదసిద్ధాంతములను జారవిడచి లాభము గడించుటే ప్రధానాశయముగా పెట్టుకొన్నదని అన్నాడుడేవిస్. అలాంటిస్థితిలో రష్యాను ధనికవాద ప్రభుత్వమన వచ్చునా ? దానికి సమానమైన వ్యతిరేక సమాధానమే వచ్చు చున్నది. ప్రతి రాజ్యమూ ధనికవాదంగానో సామ్యవాదంగానో గాక, నేడు మూడవరకమైన మరోప్రభుత్వ మేర్పడటానికి కూడా అవకాశాలున్నట్లు రష్యానుబట్టి నిదర్శనా లగపడు తున్నాయి.

అలాంటివాటిని 'ఫేసిస్టు' ప్రభుత్వా లనటానికి ఎవరూ వెనకాడ రనుకుంటాను. ఈ రోజులలో ఫేసిజం అనునది శాస్త్రీయసిద్ధాంతముగా కాక, పచ్చిబూతుగా పరిగణించబడుచున్నది. ప్రస్తుతము కొన్ని ప్రాంతాలలో నీవు వప్పుకొననిదంతా ఫేసిజం కిందనే పరిగణించబడుచున్నది. లేనిపోని వుద్రేకమును పుట్టించు ఇలాంటిమాటలు వాడకుండుటయే మంచిది మే మిక్కడ రష్యాదేశమును భూషించుటకుగాని, దూషించుటకుగాని, దానిని గురించి ఏవిధమైన తీర్పులు చెప్పటకుగానీ ప్రయత్నించటం లేదు. అనుభవముతో దానిలోని యదార్థములను గ్రహించి తెలుసుకోటానికి ప్రయత్నిస్తున్నాము. ప్రస్తుతము రష్యాలో నున్నది పెట్టుబడిదారీ ప్రభుత్వమని చాలామంది తేలిగ్గా అనేస్తు న్నారు. ప్రఖ్యాత అమెరికన్ సామ్యవాద రచయితయైన జేమ్సు బరన్‌హామ్‌క్రొత్తగారాసిన "పెత్తందారీ విప్లవము"(Managerial revolution) లో రష్యా ప్రభుత్వమునకు చేసిన నామ కరణము తగియేయున్నది. బరన్‌హామ్ అన్నట్లు పెత్తందారీ ప్రభుత్వము పెట్టుబడిదారీ ప్రభుత్వముగానీ సామ్యవాద ప్రభుత్వము గానీ కాక పరిపాలనము నడపు నిరంకుశులతోనూ, వ్యాపారమును నడపు పెత్తందార్ల ద్వారానూ అధికారముకు

చేపట్టియున్నారు. సామ్యవాద ప్రభుత్వమునకును, పెత్తందారీ ప్రభుత్వమునకునూ కొన్ని పోలికలున్నాయి. సామ్యవాద ప్రభుత్వము, పెత్తందారీ ప్రభుత్వము రెంటిల్లోనూ వ్యక్తిగతపు టాస్తిగాయున్న వుత్పత్తి సాధనాలను వినిమయమును నిర్మూలించి ప్రభుత్వ పరం చేయబడతాయి. సామ్యవాద ప్రభుత్వమంటే సమాజానికి గానీ, ప్రజాసామాన్యానికి గానీ సంబంధించినది. కాని పెత్తందారీ ప్రభుత్వంలో ప్రభుత్వము గానీ ప్రభుత్వము యొక్క జాతీయాదాయముగానీ ప్రజల ఆధీనంలో యుండక నిరంకుశత్వమును ప్రదర్శించే కొంతమంది పెత్తందార్ల చేతులో వుంటుంది. సాంఘికవ్యవస్థలందు ముందురానున్నది సామ్య వాదముగాక పెత్తందారీ వర్గప్రాబల్యం మాత్రమే. ఇప్పటివరకు మానవుడు తాను సృష్టించిన వ్యాపార రాజకీయ యంత్రములను తన స్వాధీనములో వుంచగల శక్తిలో లేడు. పెట్టుబడిదారీ విధానము తన అసమర్ధత వల్లనో అరాజకతవల్లనో పాతబడి వుపయోగం మాలినదైనది. మానవుడింకను సామ్యవాద సంఘానికి తగినట్లుగా తయారు కాలేదు.

ప్రపంచంలో ఇంకా చాలచోట్ల చీకటి యుండగానే చాలమంది ప్రభాతమైందని భ్రమపడుతున్నారు. అదిమిథ్యా ప్రభాతమనీ, తెల్లవారటానికి ఇంకాకొంత రాత్రియున్నదనీ త్వరలోనే తెలుసుకొనగలరు. సమయమొచ్చినప్పుడు చరిత్రకారుడు 1917 నాటి రష్యన్ విప్లవం సామ్యవాద దినమునకు మిథ్యాప్రభాతమని వర్ణించగలడు. మాచ్యూ ఆర్నాల్డు అన్నట్టు "రెండు ప్రపంచాలలో ఒకటి చచ్చింది. రెండవది జన్మించుటకు శక్తిచాలకున్నది."

# II

# నవయుగము

ఆస్కార్ వైల్డు అనుభవము అంటే ప్రతివాడూ తాను చేసిన తప్పులకు పెట్టే మరొక పేరే నన్నాడు. ఒక సామ్యవాది సామ్యవాదమును గురించి పునర్విమర్శన చేయుటయన్న గత ఇరవైయైదు సంవత్సరాల అనుభవాన్ని విమర్శన చేసుకోటమే అవుతుంది.

ఇరువది యైదు సంవత్సరము లెందుకనీ? 25 సం॥లే సరియైన కాల పరిమాణమని నా వుద్దేశం. గత యుద్ధము ఆఖరై కూడా 25 సం॥లైంది. నలువైపులా అలాంటిది మరల రావద్దని లోకం మొరబెట్టుకొన్నది. రష్యా విప్లవంకూడా జరిగి 25 సం॥ అయింది. భారత ట్రేడు యూనియన్ ఏర్పడింది కూడా అప్పుడే. అప్పటినుండియే సామ్యవాదము యువకుల దృష్టి నాకర్షించ సాగింది.

గత ఇరవై. సం॥ల కాలమును సమీక్షచేసి చూసినచో ప్రపంచ దౌర్భాగ్యమును నివారించుటకు కొంతవరకు సామ్యవాదమే సమర్థమైనది యని చెప్పుటకు మూలసిద్ధాంతములు కొన్ని జ్ఞప్తికి వస్తాయి. అవి యేమన మానవుడు స్వతఃసిద్ధముగా మంచివాడే, విధానము మాత్రము చెడ్డది. 'తలకొక్కటి తక్కినది దైవానికి,' అనుసిద్ధాంతముగల ధనికవాదము తనస్వలాభమునందే దృష్టి యుంచుకొని ప్రభుత్వాధికారములో భాగస్వాములైన ధనవంతులకును ధనహీనులకును, స్త్రీ పురుషులకూ పోటీలుపెట్టి పీడించుటచే అది ప్రధాన శత్రువుగా పరిగణించబడను. ధనిక

వాదము మానవ సౌఖ్యానికి, ఒక విధంగా ప్రపంచానికే కంటగింపుగా కనపడెను. ఈ ధనికవాదమే కాయకష్టముచేయు ప్రజలను నిరుపేదలుగనూ, మాతృతుల్యులైన స్త్రీలను సమాజంలో నీచాతినీచురాండ్రుగానూ, వేలకొలది బాలురను విద్యావిహీనులుగను చేసినది. చర్వితచర్వణముగావచ్చు యుద్ధములే వీటికి కారణములు. అప్పుడే ధనిక వాదమును నిర్మూలించి సామ్యవాదమును స్థాపించినచో మానవజాతి ఇంత ఇక్కట్ల లకు పాలవదన్న భావం పొడకట్టెను.

పెట్టుబడిదారీ విధానాన్ని తొలగించి ఆర్థిక విధానములో ప్రజాతంత్రమును ప్రవేశపెట్టుటకు వ్యక్తిగతపు టాస్తిని నిర్మూలించి ఉత్పత్తి సాధనములను, పంపకమును, వినిమయమును జాతీయం చేయవలెను. వర్గరహిత సంఘంయొక్క 'శక్తి కొలదీ శ్రమ, అవసరముకొద్దీ ప్రతిఫలము' అను నినాదము దాని మూల సిద్ధాంతాన్ని తెలియపర్చుతూవుంది. తర్వాత జాతి అంతా ఏకకుటుంబంలాగ ఆనందజీవితం గడుపుతుంది! లెనిన్ సామ్యవాద సంఘాన్నిగురించి వర్ణించుతూ "ప్రతివానికీ పూర్తి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలనిచ్చే స్వాతంత్ర్యము, సామ్యము గల సంఘమే నిసత్రైన సామ్యవాద సంఘ"మన్నాడు. విభిన్న సోషలిస్టు అభిప్రాయాలున్న సామ్యవాదులందరూ ఈఅభిప్రాయాలనే నమ్మియున్నారని నొక్కిచెప్పగలను. ప్రజాస్వామికంగా అభివృద్ధి చెందిన ఇంగ్లాండు ఫ్రాంసులాంటి దేశములలో ఈ పరివర్తన తుపాకిగుండ్లతో కాకుండా వోటింగుపద్ధతితోనే రాగలదని సాంఘిక ప్రజాతంత్రవాదులు (Social Democrats) నొక్కి వక్కాణించిరి. కాని అలాంటిమార్పు సాయుధవిప్లవంతోగాని రాదనియు, రష్యాలోలాగ విప్లవపార్టీయే కార్మికుల తరఫున

అధికారము చేజిక్కించుకుంటుందనియు వాదించిరి. కార్మిక నియంతృత్వ మేర్పడినతర్వాత కొంతకాలానికి వర్గరహిత సమాజ మేర్పడి అంతకు ముందున్న ప్రభుత్వము దానంతట దే వుపసంహరించుకొన్న తర్వాత అప్పుడు మనం సామ్యవాద సమాజాన్ని చేరుకొనగలమని కూడా వాదించారువారు. సామ్యవాదులలో సామ్యవాదులకు ఎన్ని అభిప్రాయ భేదాలున్నా ధనికవాదము స్థానే రాదగ్గది సామ్యవాదమనుటలోమాత్రం ఏకాభిప్రాయంలో నున్నారు. సామ్యవాదము అంతర్జాతీయ సిద్ధాంతమనియు, అందువల్ల ప్రపంచ ఐక్యసమ్మేళనము, అంతర్జాతీయ సోదర భావము కలుగుననుట కూడా మామూలై పోయింది. ఇరవై అయిదు సం॥ల క్రితం దాదాపు సామ్యవాదు లందరిలోగల ఈ నమ్మకాలను పేర్కొనటానికి కారణం వీటిని దృష్టిలో వుంచుకొనే, మనం గత ఇరవై సం॥ల పరిణామాన్ని పునరాలోచన చేయవలసి యున్నది.

## సాంఘిక ప్రజాతంత్రవాదులు

మనము ప్రజాస్వామిక, సామ్యవాదాభి వృద్ధులను ప్రత్యేకంగా విడదీసి సమాలోచించినచో సుబోధకంగా అర్థమాతుంది. ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మనీలాంటి ప్రముఖదేశాలలోని సాంఘిక ప్రజాస్వామిక గాథ ప్రతివారికీ తెలిసినదే. అది తన సిద్ధాంతము లందు తనకే నమ్మకములేని నాయకుడులేని బలహీనగాథ. 'తప్పని సరియైన క్రమాభివృద్ధి' అను నినాదము మరుగున సాంఘిక ప్రజా స్వామ్యనాయకులు సామ్యవాదము కేసి పో నిరాకరించిరి. అధికారము సందిగ్ధులు, బలహీనులు నైన జర్మన్ సాంఘిక ప్రజాస్వామ్యవాదుల చేతులనుండి జారిపోయి హిట్లరు హస్త

గతమైంది. ఇంగ్లండు, ఫ్రాన్సులలో సాంఘిక ప్రజాతంత్ర నాయకులైన మాక్డనాల్డు, బ్లం అనువారు ప్రజా స్వామిక ోద్దేశంతో వచ్చిన అనేక విప్ల వకాశాలను వ్య గత భేదాలతో జారవిడచి వారిలోనే జతమైరి. 1926 సంవత్సరాన ఇంగ్లండులో వచ్చిన సమ్మెలవలన విప్లవ పరివర్తనలు రాగల సావకాశా లేర్పడు తున్నాయని భయపడినవారిలో ట్రేడుయూనియన్ కాంగ్రెసు సభ్యులు ముఖ్యులు

ఆ కాలంలోనే ఈ దేశాలన్నిటిలో ట్రేడుయూనియన్ వారి నిరంకుశత్వము తలఎత్తింది. తమకు వచ్చు అధికారాదాయ కారణముగా వారు సామాన్య శ్రమికవర్గమునుండి వేరై, పెట్టు బడిదారీ సంఘంతో వియ్యమందసాగిరి.

సాంఘిక ప్రజాతంత్ర వుద్యమములో మరొక ప్రముఖ పరిణామదశ వచ్చింది. అంతకుముందు యుద్ధ వ్యతిరేకులుగను, సామ్రాజ్యవాద వ్యతిరేకులుగనువున్న వీరు యుద్ధాను కూలు రుగను, సామ్రాజ్యవాద అనుకూలురుగను మారిపోయిరి. యుద్ధ వ్యతిరేకిగానున్న కారణముచే యుద్ధము వచ్చినయెడల పెద్దపెద్ద సమ్మెలు చేయవలెనని తీర్మానములు తెచ్చుటచేత బ్రిటిషు కార్మికపక్ష నాయకుడుగా ఎన్నుకొనబడిన రామ్సే మాక్డనాల్డుగారి నాయకత్వము చర్చిలు గారి యుద్ధసభలో పాల్గొనుటతో అంతమొందవలసి వచ్చెను.

నిరుత్సాహాకరమైన ఈ పెద్దదేశములనుండి నార్వే, స్వీడెన్, డెన్మార్కు, ఫిన్‌లాండు లాంటి చిన్న దేశములకేసి దృష్టి మరల్చినచో అత్యంత వుత్సాహాకరమైన అభివృద్ధి చూపించిన సామ్యవాదులు కనపడతారు. ప్రజాదృష్టికెక్కి తగినంత పొగడ్త నందలేదుగాని ఈ దేశములో ఆర్థికంగాను, సాంఘికంగానూ,

ప్రజాస్వామికంగానూ అత్యంత అభివృద్ధి కనపడుతుంది సామ్యవాద సంఘానికి పోవు మార్గాన ఏది దాపుననున్నదని అడిగిన యెడల నే నీ దేశములను చూపి యుండేవాణ్ణి !

## పరభృత్యత్వము

చిన్న రాజ్యాలకూ, పెద్ద రాజ్యాలకు గల ఈ వ్యత్యాసము చూచినచో మనకు ఆశ్చర్యము కలుగుతుంది. ఈ వ్యత్యాసములకు గల కారణమేమి? మొదటివానిలో సామ్రాజ్య వాదముండుటయు, రెండవ వానిలో లేకపోవుటయే కారణము. బ్రిటిషు కార్మిక వుద్యమం సంకరమవటానికి కారణం ము:ఖ్యంగా వారు హిందూదేశము, అలాంటివే మరికొన్ని దేశములలో దోయబడిన సొత్తుతో పొత్తు కలిగి యుండుటము, ఆ పక్షము యొక్క కపట నాయకత్వం కూడా ఈ ఎంగిలి కూటికి లోబడి యుండట మూను. అంతమాత్రంచేత ప్రతి బ్రిటిషు కార్మికుడు సామ్రాజ్య వాది యని చెప్పలేము. బ్రిటిషు పాలకవర్గము తన దేశములో సామ్య వాద విప్లవము రాకుండా, తన దేశ కార్మికుని ఈ విధముగా తృప్తి పరచు సిద్ధాంతమునే పరభృత్య సిద్ధాంత మనవచ్చును.

'నీవు తయారు చేసిన ప్రణాళికను అమలు జరుపుటకు ఆర్థిక సహాయ మెక్కడినుంచి వచ్చునని' ఎవరో, సర్ విలియమ్ బీవరిడ్జిని అడుగగా 'నిరుద్యోగ సమస్యా పరిష్కారము అయిన వెంటనే ఆర్థిక సాయ: చేకూరుననియు, దానికోసము ఇంగ్లండు తన పారిశ్రామిక వస్తు సామాగ్రిని విడుదల చేయుట అవసరమనియు, విడుదల శాశ్వతంగా వుండవలెనన్న యుద్ధానంతరం కూడ తమ విదేశీయ మార్కెట్లను స్థిరముగా వుంచుట

అవసరమనియు, చెప్పెను. అంటే మనవంటి పరాధీనదేశములను, వెనుకబడ్డ జాతులవారిని ఇంకా అణచి వుంచాలన్నమాట. బ్రిటిషు కార్మికపక్షచరిత్ర భారతీయులకు, తదితర సామ్రాజ్యాంతర్గత దేశములకును కళంకంగా కనపడటానికి కారణం వారి పక్షనాయకులు సామ్రాజ్యము పోవు నెడల తమ పక్షపువారు కడుపు కట్టుకొనవలసి వచ్చునని - ఆతురత పడుటయే. బ్రిటిషు కార్మికులును, వారి నాయకులును కూడా తమసామ్రాజ్యాన్ని వదులుకోవాలన్నంత త్యాగానికి కూడా సిద్ధపడటం లేదు. అభివృద్ధికర అంతర్జాతీయ సమాజాన్ని స్థాపించు ప్రయత్నంలో బ్రిటిషు కార్మిక వర్గానికి - తమ స్వార్థపరత్వము, ప్రస్తుత జీవిత సమస్య అడ్డు తగులుచున్నవి.

ఈ విషయము మనసులో వుంచుకునే సర్ స్టాఫర్డు క్రిప్సు 1935 లో ఒక భారత సామ్యవాద పత్రికకు వ్యాసం వ్రాస్తూ 'సామ్యవాదము బ్రిటనుకీ, స్వాతంత్ర్యము భారత దేశానికీ పరస్పరాధీనములని' అన్నాడు.

## సా మ్య వా దు లు

మనలో చాలమంది తమ జీవితములలో ఎప్పుడో ఒకప్పుడు క్రియా శూన్యులైన సాంఘిక ప్రజాసామ్యవాదులనుండి కొంత ఆశతో సామ్యవాదులవైపు మరలినవారే యుందురు. అంతర్జాతీయ సామ్యవాదము స్థాపించబడిన కొలది సంవత్సరములలోనే అది రష్యా విదేశాంగ కార్యాలయ ఉపశాఖ తప్ప మరేమీ కాదని గ్రహించారు. చాల దేశములలో అది సామ్యవాదులకును, ట్రేడు యూనియనులకును కలతలు పెట్టి, చీలికలు కలిగించి - చెడగొట్టుటయే ప్రధాన వృత్తిగా పెట్టుకొని

తన చరిత్రను మలినపర్చుకుంది. జర్మనీలోని నాజీలతో చేతులు కలిపి సాంఘిక ప్రజా తంత్రరాజ్యమగు వెయిమర్ ప్రభుత్వాన్ని పడగొట్టింది. కార్మికవర్గములలో ఉత్సాహముతో పనిచేయు చున్న దేశభక్తులకు గతసంవత్సరము అంతర్జాతీయ సామ్యవాద సంఘాన్ని రద్దు చేయటం ఆనందంకలిగించి, కొంత పీడ వదిలిం దనిపించింది.

మన దేశములోని కమ్యూనిష్టుపార్టీ యొక్క జాతీయవ్యతి రేక చర్యలు అందరూ చూచినవే. స్వాతంత్ర్య సముపార్జనకు భారతదేశంలో జరిగిన ప్రజా వుద్యమాలలో వీరు వ్యతిరేకిం చని దొక్కటీలేదు. 1930-31 ల లోనూ, 32-33 ల లోనూ ఇటులే వ్యతిరేకించారు. 1942 లో ఇట్టి వీరి చర్యలు పట్టాభి షేకము కట్టుకొన్నవి. తర్వాత జాతీయ స్వాతంత్ర్య పోరాటము నకు ద్రోహమొనరించి 'ప్రజాయుద్ధ' మను విషపూరిత నినా దంతో యుద్ధానికి సాయంచేయసాగారు. నేడు కమ్యూనిస్టులు బ్రిటిషు సామ్రాజ్య పట్టుగొమ్మలైన స్వతంత్ర రాజ్యలతోను, మతసంస్థలతోనూ కలసిపోయిరి.

భారత కమ్యూనిస్టులు తాము అంతర్జాతీయవాదులము గనుక, జాతీయ వాదులకన్న గొప్పవారమని విర్రవీగుచున్నారే గాని, యదార్థానికి రష్యన్ జాతీయవాదుల నతిక్రమించినవారు కాదు. వారికి రష్యాప్రభుత్వము, రష్యా విదేశాంగవ్యవహారము లందున్నంత ఆసక్తి తమ దేశ స్వాతంత్ర్యమునందుగానీ, తమ దేశవాసుల యోగక్షేమాలయందుగానీ లేదు. స్టాలిన్, హిట్లరుల ఒడంబడికానంతరం, ప్రస్తుతయుద్ధం ప్రారంభమైన మొదట్లో (1939) ఈ కమ్యూనిస్టులు ఇతరులతోపాటే గొంతెత్తి 'ఇది సామ్రాజ్యవాద యుద్ధమనీ, బ్రిటిషు, ఫ్రెంచి, అమెరికా

సాంఘిక ప్రజాతంత్రవాదము విఫలమగుటఒకటీ, రష్యా విప్లవము అనుకొన్న సామ్యవాదసమాజాన్ని స్థాపించలేకపోవట మరొకటీ, దానిమీద Totalitarianism అనే చీడపురుగు తలెత్తటం - నూతన భావాలకోసం మనసులు విప్పుకు కూర్చున్నవారు తమను తప్పు దారితొక్కించిన సామ్యవాద సిద్ధాంతములను పునరాలోచించు అవసరం కలిగించింది.

అలా చేయ సాహసించలేని పిరికిపందలను గురించి జార్జి బెర్నార్డుషాతన 'మేజర్ బార్బరా' అను నాటకంలో ఆత్మోప దేశంగా సం॥రముల కొలది ఆలోచనాశక్తినీ,కృషినీ,వేలకొలదీ ధనమునూ వినియోగించి తయారు చేసినఒక బాంబో, తుపాకో, వెంట్రుక వాసి గురి తప్పిపోయిన మనము చేసేదేముంది? దానిని వదిలి వేయుము. దానికోసము మరో గంటగానీ, మరో రూపాయిగానీ వ్యర్థపర్చకుండా వదిలివేసినట్లె నీవు ఒక నీతి సూత్రాన్నో, మతాన్నో, లేకపోతే అలాంటిదే మరొక దానినో కనిపెట్టావనుకో, అది పరిస్థితులకు రిగా అనుకూలించక పోతే వెంటనే దానిని వదిలివెయ్యి. అనుకూలించిన దానినే తీసుకో. ప్రస్తుత ప్రపంచంలో నున్నలోపం ఇది. అది పనికి మాలిన మరలను, యంత్రములను పారవెయ్య లదు గాని—తన పాత ఆదర్శ్యలను పాత నీతులను, పాత మతములను, పాత రాజకీయ చట్టములను వదిలి పెట్టలేదు" అన్నాడు.

పాశ్చాత్య నాగరికతన్నా పాశ్చాత్య భావాలన్నా అలాంటిదేదైనా సరే - అతిశయోక్తులతో ఆశ్చర్యంగా - తల వంచుకు మొక్కే భావదాసులు కొందరున్నారు మనదేశంలో. వారినుంచి మనము నేర్చుకొనవలసిన దేమియులేదని వారి అభివృద్ధికర ఉద్యమముల చరిత్ర చెప్పుచున్నది. అభివృద్ధికరమైన

ఆలోచనలున్న వారుగానీ, వాటి మూలసూత్రములను క్షుణ్ణంగా చదివి అర్థం చేసుకున్నామనుకున్న వారుగానీ తికమకలు పడు తున్న పాశ్చాత్య వేత్తలను తీవ్రంగా విమర్శించి వారిని సరైన దారిలో పెట్టే సమయం దగ్గరకొచ్చింది. గత 25 సం॥ల సంఘటనలనుబట్టి పాశ్చాత్యుల సామ్యవాదపు సిద్ధాంతాలు ఎక్కడెక్కడ తప్పుదారి పట్టినవో చూపించగల స్థితిలోవున్నాము మన మిప్పుడు.

## జాతీయమొనరించుటే దివ్యౌషధమా ?

మార్క్సు వాదములో పునర్విమర్శన చేయ తగ్గవి నాలుగు ముఖ్యసిద్ధాంతము లున్నవని నా వుద్దేశం. ఇంకొన్ని కూడా వుండివుండవచ్చు. మొదటిది - వ్యక్తిగతపు టాస్తిని నిర్మూలించి జాతీయం గావించినచో దానంతటదే ఆర్థిక ప్రజాతంత్ర ములలోనికి వచ్చి, వర్గరహిత సమాజమేర్పడుట. తప్పనిసరిగా అట్లా జరుగవలసిన అవసరంకూడా లేదని రష్యాలో మనకు స్పష్టమైంది కూడాను. మొట్టమొదటలో సామ్యవాద తత్వ శాస్త్రజ్ఞులు జాతీయ మొనరించు ఆస్తి ప్రభుత్వ పరమైనప్పటికీ ప్రభుత్వము ప్రజలకు చెందకపోవచ్చుననియు, ఆర్థిక కేంద్రీకరణ ప్రయత్నములో రాజకీయ ప్రజాస్వామిక హక్కులు భగ్నమై పోవచ్చుననియు వూహించుటచే వారికది అంతగా నచ్చలేదు. జాతీయం చేయబడిన సొత్తుమీద పెత్తనమును, భాగమును చేజిక్కించుకొని ఒక క్రొత్తవర్గము తలెత్తుట మనకు కనపడుతూ వుంది. ధనికవర్గంలాగ వ్యక్తిగతంగా యంత్రములను, కర్మా గారములను గనులను కలిగియుండుటకు బదులు ఈ నిరంకు శుల, మేనేజరుల వర్గము ప్రభుత్వాధీనములోనున్న గనులు,

కర్మాగారాలు అన్నిటికీ భాగస్వాములై యుంటున్నారు. కార్మికులు పూర్వంలాగానే తమ కూలిడబ్బులు తెచ్చుకొంటున్నారు. కాని స్వంతపెట్టుబడిదారుల స్థానే ఈ కొత్తవర్గమువారు ప్రభుత్వపు బాండ్లమీది వడ్డీనెపముతో లాభములు పంచుకొనుచున్నారు. వుత్పత్తి సాంఘికపర మొనరించ బడుతూవుంది. గాని పంపిణీలు మాత్రం అలా జరగటంలేదు. ధనికవాదము స్థానే సామ్యవాదము వచ్చుటకుబదులు నిరంకుశత్వ మాక్రమించినది. రాజకీయ ప్రజాస్వామికం లేకుండా సంపత్తిని జాతీయ మొనరించుటచే ఒక కొత్తరకమైన దోపిడీకి దారితీస్తుంది. ఆస్తులయజమానత్వముగాక దాని నడుపులోవుంచు రాజకీయాధికారము ప్రధానమైనదని క్రమేణా ఇప్పుడు తెలిసివచ్చింది. అలా కాకపోయినచో భారతదేశంలో ప్రస్తుతం ప్రభుత్వపు టాస్తిగా యుండి, వారిచే నడపబడుచున్న రైల్వేలను కూడా సామ్యవాద పద్ధతులమీద నడుపబడుచున్న వని అంగీకరించవలసి వస్తుంది

## నియంతృత్వం ద్వారానా?

మార్క్సు సిద్ధాంతములలో పునరాలోచన చేయవలవలసిన వానిలో రెండవది - సామ్యవాదమునకు మారు మధ్యకాలంలో కార్మికనియంతృత్వము (కార్మికులతరఫున కమ్యూనిష్టు పార్టీ పెత్తనం)రావటం తప్పనిసరి. ఇలాంటి నియంతృత్వము తన పని నెరవేరగానే విడిపోవునని ఎంజిల్సు మహాశయుడు నుడివిన రీతిగానే లెనిన్‌కూడా చెప్పాడు.

లార్డు ఆక్షన్ మాటలలో మనకు చరిత్రవలన తేలిన విషయం'అధికారమును చెరచును, సంపూర్ణాధికారమును సంపూ

ర్ణముగా చెరచును.' వర్గరహిత సమాజమేర్పడి అన్నిరకములైన వ్యక్తిస్వాతంత్ర్యముల కుతిక నొక్కివేయుచున్న సోవియట్ ప్రభుత్వం సడలు ధోరణగానీ, దానంతటదే నడుచు సూచనలు గానీ కన్పించుటలేదు. ఇకముందుకూడా ఆ ప్రభుత్వము ప్రజా స్వామికంగా మారే సూచనలేమీ కనపడటంలేదు.

మార్క్సుకు పూర్వ మున్న సామ్యవాద భావములు ఆకాశ హర్మ్యములనీ, స్వప్నయూహాలనీ తరచుగా మార్క్సు అనుయాయులు చెబుతూవుండేవారు. గత ఆరేడు సంవత్సర ములనుండి అధికారం చేజిక్కించుకోటానికి ప్రత్యర్థి సంఘాన్ని రక్తపాతం చేసిన రష్యానియంతృత్వ ప్రభుత్వము ఒక సుదినమున నిద్దురలేచి చరిత్రాత్మకమైన నాపని ముగిసినది; నేనూ, నా గూఢ చారిశాఖ ఇక అవసరంలేదు, ఇక రద్దుకావచ్చునని తనకు తానే గుర్తించునని భావించు ఈ సామ్యవాదుల అంధ విశ్వాసముకన్న స్వప్నావస్థలోని భావములు వేరుగావుంటాయా? 'సామ్యవాద మునుగురించి సజ్జనులకుతోచిన అభిప్రాయములు స్వప్న జగత్తునకు చెందినవని మార్క్సు చెప్పెననియు, అట్టివి దుష్టులకు తోచిన భావములని స్టాలిన్ వర్గమువారి నమ్మకమనియు' మాక్సు ఈష్ట మెన్ వ్యంగ్యంగా అన్నాడు.

పునరాలోచన చేయవలసిన మార్క్సు సిద్ధాంతములలో మూడవది - కార్మికవర్గ స్వార్థంకోసం వ్యక్తిగతపు టాస్తు లున్న వర్గముమీద ఏవగింపుకలిగించి సామ్యవాద ప్రభు త్వాన్ని స్థాపించటం. 'గత ఇరవైయైదు సంవత్సరముల చరి త్రనుబట్టి చూడగా ఈ సిద్ధాంతము నిలుచునట్లు తోచదు. సంఘంలోని విభిన్న వర్గములవారికి తమ తమ స్వార్థములకోసం పరస్పరసంఘర్షణ లున్నమాట వాస్తవం. శ్రామిక వర్గమునకు

సాంఘికస్వార్థమును బోధించుటవలన అది ప్రత్యేకముగా దోపిడీ చేయు ఒక వర్గముగా తయారగుచున్నది. సామ్రాజ్యముమీద వచ్చు లాభములలో కొంత మొత్తమును బ్రిటిషు ట్రేడు యూనియన్ ద్వారా బ్రిటిషు కార్మికునికి ముట్టజెప్పుటవలన వారు ప్రపంచ సామ్యవాదమునకే చీడపురుగులైన సామ్రాజ్య వాదమును నిలబెట్టుటకు ఎలామారిరో తెలుసుకున్నాము.

అదీగాక పరస్పర ద్వేషము, స్వార్థము, సంఘర్షణము ప్రబోధింపబడిన ఒకజాతి ఏనాటికైనా పరస్పర సహకార ప్రేమ లమీద ఆధారపడిన వృత్తమసంఘంగా తయారు కాగల్గదా? ఆచరణయొక్కయు, ఫలితాంశములయొక్కయు గందరగోళము ఇందే ఇమిడియున్నది. ఆ కాలంలో మార్క్సు అనుయాయు లలో ప్రముఖుడైన ట్రాట్స్కీ 'వర్గములను శాసించుచట్టము' (law of laws) అన్నాడు. కాని శాస్త్రము చట్టముల నన్నిటిని వశపరచుకొను చట్టములేదని చెప్పుచున్నది.

## ఏ క ప్రా తి ని ధి త్వ మా ?

పెట్టుబడిదారీ విధానము స్థానే రాదగ్గది ఒక్క సామ్యవాదమేనని సామ్యవాదుల నమ్మకము. 1937, 38 సం॥ వరకు నేనుకూడా ఇలాంటి అభిప్రాయంతోనే వున్నానని అంగీక రిస్తాను. రాత్రి తర్వాత సుప్రభాతమైనట్లే, పెట్టుబడిదారీ విధాన నాశనానంతరం సామ్యవాదము సుప్రభాతంలాగ వస్తుంది. కాని అలా జరుగుతుందా? పాతకాలపు పెట్టుబడిదారీ విధానపు ఆట ముగిసినది తేటతెల్లమే. కాని దాని స్థానే వచ్చునది సామ్యవాద మొక్కటేనా? మూడవరకమైనది ఇంకేమైనా వచ్చుటకు అవకాశమున్నదా? యోచనాపరులు వేయు ప్రశ్న ఇదియే.

దీనికే బరన్‌హామ్ అనునాతడు తన పెత్తందారీ విప్లవం (Managerial Revolution) అను పుస్తకంలో సమాధాన మిచ్చాడు. పెట్టుబడిదారీ విధానము ఎలాగూ నిలువలేదు; గనుక దానిస్థానే తప్పకుండా వచ్చేది సామ్యవాదమేనని మార్క్సు వాదులు చెప్పుచున్నారు. ఈ వాదనల ఫలితంగా మూడవది వచ్చుట వాస్తవమేగాని, రెండవదాని నిర్ధారణయే లేనప్పుడు దాని సారాంశముగా తేలు మూడవది మాత్రం ఎట్లు వచ్చు ననేదే వివాదాంశమని బరన్‌హామ్ చెప్పాడు. నేడు రష్యాగాని జర్మనీగానీ సరియైన అర్థములో పెట్టుబడిదారీ విధానమునకు చెంది యుండలేదు. జర్మనీని గురించి మీ కేదైనా అనుమానమున్న యెడల బరన్ హామ్ గ్రంథమో, పీటర్ డ్రకర్ 'ఆర్థిక పురుషుని అంతము'(End of economic man) అను గ్రంథమో, లేక ఫ్రెడా అట్లీ యొక్క 'గతించిన స్వప్నము' (The dream we lost) అను గ్రంథమో చదివిన చాలును. 'ఎకనమిక్‌స్టు' పత్రిక సంపాదకుడైన జాఫ్రి క్రౌధర్ "చిట్టచివరకు జర్మను వ్యాపారికి మిగిలిన స్వాతంత్ర్యము-కర్మాగారములోని సామానుమీద తన పేరుమాత్రము వేసికొన వచ్చును"అని క్లుప్తంగా అక్కడిస్థితిగతులనుగురించి వివరించాడు.

బరన్ హామ్ అన్నట్లు "రష్యా జర్మనీ రెండింటిలోకూడ వర్గ రాహిత్యం అంతర్జాతీయం, స్వాతంత్ర్యం ఆదర్శముగా గల సామ్యవాదముకోసం కాంక్షించే ప్రజల మనోభావములను సామ్యవాదమను పేరుతో ప్రదేశికపరచి వారి సాయంతో సాధించిన పెత్తందారీ విధానపు ఆర్థిక విధానము మరుగున మరో క్రొత్తరకపు దోపిడివర్గాన్ని నిర్మించటం చాల విచార కరం"

ఇట్టి పరిస్థితులను మనసు నందుంచుకొనియే ప్రముఖ సామ్యవాది యైన విలియమ్ మారిస్ దివ్యదృష్టితో "మానవు లెట్లు పోరాడుచున్నారో, ఎట్లు ఓడిపోవు చున్నారో, వారు ఓడిపోయినప్పటికీ వారికోర్కె యెట్లు సిద్ధించుచున్నదో, సిద్ధించినా కూడా వారనుకున్నది ఎట్లు కాకుండా పోవుచున్నదో, దానికోసమే మరొక పేరుతో ఇతరులు ఎలా పోరాడ వలసి వస్తూవుందో తలపోయు చున్నాను" అని అన్నాడు.

పెట్టుబడిదారీ విధానము పడిపోయిన తర్వాత వచ్చునది సామ్యవాదముకాక మాల్టావ్ చెప్పినట్లు 'అభిరుచులను బట్టి, ఏకాశయ ప్రభుత్వ విధానమో, నిరంకుశ జాతీయ ప్రభుత్వ విధానమో, హిట్లరిజమో, లేక స్టాలినిజమో, ఏ పేరుతోనైతే నేమి రావచ్చునని తేలుచున్నది గదా ? ఎంతో ప్రయత్నంతో నెలకొల్పబడిన పారిశ్రామిక ప్రభుత్వ యంత్రమును తమ అదుపులో నుంచుకొనజాలినంత తెలివితేటలు సామన్య ప్రజలకు లేకుండుటయే యిట్టి అవాంఛనీయ ఫలితములకు కారణమగుచున్నది. దీనినిబట్టి 'మానవ స్వభావమును మార్చజాలవ'ను పాతనినాదము అభివృద్ధి నిరోధకమేయైనా అసత్యమనుటకు వీలులేకుండావున్నది. అది తెలివితక్కువ. 'మానవునిమానసికాభివృద్ధిపరిణామమే చరిత్ర'అని చెప్పాడు మార్క్సు. మానవస్వభావము ఎల్లపుడును మారుచునేయున్నది. జర్మనీ రష్యాలలో గత 20 ఏళ్లలోనే మనకళ్లయెదుట తీవ్రమైనమార్పు వచ్చింది. కాని ఆ మార్పుపై కెక్కవచ్చు. పాలనా యంత్రమును స్వాధీనము నందుంచుకొనుటకు తగినంతగా మారినదనుకొనుటయే సందేహము. దీనిని దృష్టిలో వుంచుకొనే జి. డి. హెచ్. గోల్ 'న్యూస్టేట్సుమన్' పత్రికలో ఇంగ్లండులోని

సామాన్య మానవుని బుద్ధివికాసము స్థానిక సంస్థలకు పైదాటిన ఏ పరిపాలనా విధానమునైననూ సమర్థతో నడుపగలిగి నంతగా అభివృద్ధిచెందలేదని వ్రాశాడు.

ఈస్థితిలో మనము ఆశవదలుకొని ఏదో ఒక రకమైన ఏకాశయ ప్రభుత్వ విధానము నంగీకరించుటయో, లేక బూజు పట్టిన పెట్టుబడిదారీ విధానమునంగీకరించుటయో తప్ప చేయ తగ్గది లేదా? ఈ రెండు పద్ధతులే తప్ప గత్యంతరంలేదా? ఇలా అంగీకరించుట మానవశక్తియొక్క ఓటమియే అవుతుంది. మనము సాధింపదలచుకొన్న ఉదారాశయములు వెదకితే లభించకపోయి నందువల్ల-ఆ ఆశయమునే వదలుకోవటం చెడులో తక్కువరకపు చెడును మెరుగును వినాశనకర తార్కికసూత్రము నవలంబించి నట్లగను మన జీవితకాలంలోనే సిద్ధించినా సిద్ధించకపోయినా వున్నతసాంఘికాదర్శములకొరకు పోరాడుట జీవిత ధర్మము లలో నొక భాగమని నిర్థారణ చేయబడినది. దీనినే పురాతన గ్రీకులు మహాత్తర జీవితము (Good life) అనిచెప్పిరి. ఆర్థిక ప్రణాళిక కొరకు స్వేచ్ఛను గోల్పోనివ్వమన్న సిద్ధాంతముకన్న కష్టసాధ్యమైన దానికొరకు తక్షణము ప్రయత్నింతును, అసం భవమైన దానికి తరువాత ప్రయత్నింతును అను సిద్ధాంతమే నాకు నచ్చినది.

ఇదివరలో నేనుదహరించిన అర్థర్ కోయెస్లర్ "1917 లో స్వప్న రాజ్యము చేతికందిన దనుకొంటిమి. దోస్సంధి ః లంలో దానికి వాయిదా పడినది. ఈదోస్సంధియను యెడారిలో మనము జలాశయములను కల్పింతము" అని వ్రాశాడు.

నేటి స్థితి గతులనుబట్టి ఆర్థిక సంపత్తి సమాజపరంచేయ డమూ, స్వాతంత్ర్యము రెండూ కావలెనని పట్టుపట్టువారే

సామ్యవాదు లగు చున్నారు. వారందరు సామ్యవాదము నేటి వరకు సిద్ధాంతముల మీాద ఆధారపడియున్నదో, వానిని సాధించుటకు ఏమేమిమార్గములున్నవో పునరాలోచించుట అవసరం. అవసరమనుకున్న మనము మార్క్సుయొక్క పై నాలుగు నిర్వచనముల ప్రాముఖ్యతను ఇరవయ్యో శతాబ్దపు వుత్తరార్థానికివదలిపెట్టుట యే సామ్యవాదుల విమర్శనా ఫలితమైయున్నది. ఈ దృష్ట్యా చూచి జాత్యాధిపత్యము, ప్రభుత్వాధిపత్యము రెంటిని వాటికి తగిన స్థానములో వుంచుట అవసరము. ప్రభావంతమైనది యాజమాన్యముకాదు కావున జాత్యాధిపత్యము (Nationalisation) మన కప్రస్తుతము. ఇంకా మనము కోరినా లేక పోయినా అదియేర్పడక తప్పదు. ఆర్థికావసరములు ఎడతెరపి లేకుండా ఆవైపునకే తీసికొని పోవుచున్నవి. ఈతీవ్రగమనము వలన రాజకీయ సామాజిక వ్యవహారములలో కలుగు చిక్కుల నెదుర్కొనుటకును, సంఘపరమైన ఆర్థికవిధానము ఏకాశ్రయ ప్రభుత్వమును తెచ్చిపెట్టకుండా చేయుటకును మనము సిద్ధపడవలెను.

## రా జ్య మె వ రి ది?

ఇది ప్రశ్నలకు ప్రశ్న. రష్యాజీవితమును 10 సం॥ ల పాటు స్వయంగా పరిశీలించిన విలియమ్ హెచ్. చాంబర్లెన్ "ఆర్థిక జీవితములో ప్రభుత్వ వ్యాపారమేదో, వ్యక్తిగత వ్యక్తి వ్యాపారమేదో ప్రభుత్వమే ప్రజలకు చెందినదో, ప్రజలే ప్రభుత్వమునకు జెందిరో ప్రత్యేకించి నిర్ణయించుట అత్యావశ్యమగుచున్నది" అని వ్రాశాడు (A false Utopia). భవిష్యత్తులో సామ్యవాద పటమున ఈ ప్రశ్నలకే కేంద్రమున

తావున్నది. సంఘపర మొనరింపబడిన ఆర్థికవ్యవస్థ వ్యక్తి స్వాతంత్ర్యమును రాజకీయప్రజాతంత్ర విధానమును విఘాతమొనరించుటయే దానికి కారణము. ఇవియే సామ్యవాదమునకు ప్రమాదకరమైన దెబ్బలు. మానవ గౌరవమును ముఖ్యాశయముగా పెట్టుకొనియే 20 శతాబ్దపు వుత్తరార్థాన సంఘర్షణలు చెలరేగుతాయి. మానవహక్కులను సంపాదించుటకు పాల్గొనని వారు సామ్యవాదులనిపించు కొనజాలరు.

## ప్రయత్నములు — ఫలితములు

ఆర్థిక సమత్వమే వ్యక్తి స్వాతంత్ర్యమునకు, ప్రజాస్వామిక ప్రభుత్వానికీ అత్యవసరమైనప్పుడు వానిని సాధించు మార్గము కూడా వానికి తగినట్లుగా వుండవలెను. ఫలితమే దాని ప్రయత్నమార్గముల నిర్దుష్టతను తెలియజేయు నను సామ్యవాదవినాదము సరియైనదికాదని పై కారణమునుబట్టి రుజువగుచున్నది. కమ్యూనిష్టుపార్టీవారి సూత్రంప్రకారం వారికి వుపయోగించినంతవరకు అబద్ధము, దగా, హత్య మొదలగు ఏసాధనమునైనా వుపయోగించవచ్చు. స్టాలిన్ చేసిన సైనిక బల ప్రయోగము, ప్రతికక్షులను రూపుమాపుటకు అవలంబించిన విధానము, చరిత్రను మిథ్యపరచుట మొదలైనవి గర్హింపతగినవేగదా! సామ్యవాదము సంపాదించతగినవి పవిత్ర హస్తములు పవిత్ర మార్గములద్వారానే. న్యాయమనగా సత్యమును కార్యరూపమున పెట్టుట అని చక్కగా నిర్వచించినారు. 'ఆత్మశుద్ధియు, సత్యదీక్షయు లేనియెడల మన బ్రతుకు అరణ్యముల పాలగును.

ఒక శతాబ్దముక్రితం శామ్యూయల్ టాయిలర్ కాల్‌రిడ్జి ప్రస్తుత సామ్యవాద వుద్యమునే అణగద్రొక్కిన పతనమని భావించి మరియొకసందర్భంలో 'సత్యముకన్న క్రైస్తవమతమునే ఎక్కువగా ప్రేమించువారు, రానురాను, దేవాలయాన్నే క్రైస్తవ మతముకన్న ఎక్కువగా ప్రేమించుచు, తుదకు తన్నే అన్నిటికన్న అధికముగా ప్రేమింతురు.' అన్నాడు,

అయితే మనం వెనుకకుతగ్గి సాంఘిక ప్రజాతంత్రవాదుల వలె చట్టబద్ధమైనట్టియు, న్యాయ శాస్త్రానుగుణ్యమైనట్టియు కార్యక్రమమునకే బద్ధులమై యుండవలెనా? స్కాండినేవియా రాజ్యములలోవలెనే యుండినయెడల బహుశా నేను అవునని సమాధానమిచ్చేవాణ్ణి! ఇట్లనుటచేత ఇంగ్లాండువంటి ప్రజాతంత్ర రాజ్యములలో చట్టసంబంధమైన మార్పులవలననే సామ్యవాద సమాజము ఏర్పడుననిచెప్పిన మార్క్సు సిద్ధాంతమును నే నను సరించియుండేవాణ్ణి. కాని ప్రపంచమంతానో, లేక కొంతో ప్రజాతంత్రవిధానమును కలిగియుండలేదు. మన కీ దేశములో ప్రజాస్వామిక ఛాయలు లేకపోగా వ్యక్తిస్వాతంత్ర్యము అసలే శూన్యము.

## నూత్నాయుధములు

తప్పని సరిగా వచ్చు నియంతృత్వ విధానమును, ప్రభుత్వ దౌర్జన్యమును తొలగించి, సామ్యవాద పరివర్తనమును చేకూర్చ గల ఒక మార్గమును మనవంటివారు అన్వేషింపవలసియున్నది. యీ విషయములోనే మహాత్మాగాంధీగారు కొన్ని మార్గములను చూపియున్నారు. తనకున్న జ్ఞానమును అభివృద్ధి చేసుకొని, తాను తేగోరు సాంఘిక పరివర్తనములకు నూతనము శక్తివంతమును నగు పరికరములు సేకరించ దలచిన

ప్రతి సామ్యవాదియు, వానిని జాగ్రత్తగా అర్థము చేసికొన వలసి యున్నది.

గాంధీగారి ప్రబోధములలో ఆలోచించి తయారుచేయ బడిన ఆర్థిక ప్రణాళిక లేకున్నను, విచక్షణ లేకుండ వాని నన్నిటిని మన మంగీకరించక పోయినను, ఆర్థిక సమత్వమునకు నెల్లప్పుడును ఆయన యిచ్చు ప్రాధాన్యతను మనము ముఖ్యముగా గమనించ వలసియున్నది. "మన నిర్మాణ కార్యక్రమము, ఆర్థిక సమత్వ సూత్రముమీాద నిర్మింపబడనిచో, అది యిసుక మీాది బొమ్మరిల్లగు"నని, ఆయన చెప్పియుండెను. మన ఆదర్శ సాఫల్యమునకు సంబంధించినంతవరకు, గమనార్హమైన కొన్ని సూచనలను, గాంధిమహాత్ముడు కలిగియున్నాడు. వానిలో మొట్టమొదటిది, సమిష్టి శాసన నిరోధము. (Mass civil resistance) యి యున్నది. ఈసమిష్టి కార్యక్రమము, న్యాయ శాస్త్రపద్ధతులను బట్టిగాని, పరిపాలనా విధాన గౌరవములను బట్టిగాని, నిబంధింపబడక, పవిత్రమైన దౌర్జన్య రాహిత్యపద్ధతులతో మాత్రమే కట్టుబాటు చేయబడినది. ఈ పద్ధతిలోని సుగుణ మేమన, యిది ప్రత్యర్థులపట్ల భౌతిక పరివర్తనమును తేకుండుటయే గాక, ప్రజాతంత్ర విరుద్ధ శక్తులతో పోరునప్పుడు గూడ ప్రజాతంత్ర పద్ధతుల నవలంబించు చున్నది. ప్రజాతంత్రము ఒక విధానమే గాక మానవ స్వభావమను గొప్ప సత్వమును సైతమిది నిరూపించు చున్నది. సాయుధ విప్లవోద్యములు అణచివేయబడి నప్పుడు సంఘములో కలుగు నైతిక పతనమును, నిరుత్సాహమును, శాసన నిరోధ మణచివేయబడి నప్పుడు సంభవింపకుండుట మన అనుభవమువల్ల తెలిసికొంటిమి. దౌర్జన్యమునకే దారి తీసి అదేస్వభావముగా మారి,

రష్యాలోవలె విప్లవోద్దేశ్యములనే తన ప్రయత్నములో విస్మరింపజేయునని మన మొప్పుకొన్నచో గాంధిమహాత్ముని మార్గమే మెరుగనిపించును. ఎన్నిక హక్కు (Voting) లేనట్టియు, దౌర్జన్య విముఖమైనట్టియు, యీ పద్ధతియే మన దేశము వంటి దేశమునకు తగియున్నది. సామ్యవాదము లేనిచో, ప్రజాతంత్ర మసంభవమని సామ్యవాదులు చాల వాదించిరి. దౌర్జన్య రాహిత్య సమాజములోనే తప్ప ప్రజాతంత్ర విధానము గాని, సామ్యవాదముగాని యేర్పడుటకు వీలులేదని మహాత్ముడు నిరూపించియున్నాడు.

## రద్దుచేయబడిన ఆర్థిక కేంద్రీకరణము

మన అందరి పరిశీలనకును గాంధిమహాత్ముడు చూపిన ముఖ్యమైనసూత్ర మింకొకటియున్నది. ఆర్థిక కేంద్రీకరణమును రద్దుచేయవలెనని ఆయన గట్టిగా చెప్పియున్నాడు. ఆయన బోధనలోని యీ భాగమును, "తిరిగి పల్లెటూరి జీవితమునకు మరలుట"యని నిశితముగా విమర్శించినవా రున్నారు.

మహాత్ముని యీఅభిప్రాయముమీద సామ్యవాదులు ప్రకటించవలసిన భావమేమి ? నూతనవిధానము సరిపడని విచిత్ర భాషియనియు, యంత్రములన్న తీవ్రముగా నిరసించువాడనియు, విసుగెత్తించు పురాతన యుగమునకు లాగుకొని పోవువాడనియు, మహాత్ముని గురించి మనము భావించవచ్చునా ? ఇది నిజమే యగునెడల ప్రధానమైన వ్యాపారముల సన్నిటిని జాతీయ మొనరించు పద్ధతిని బలపరచు మహాత్ముని విధానము నకే మని అర్థము చెప్పగలము. "నేను యంత్రములను నిరాకరించుటలేదు, వానిమీది వ్యామోహమును మాత్రమే నిర

సించు చున్నా"నని మహాత్ముడు చెప్పియున్నాడు. రాట్నము కూడ ఒక యంత్రమే. విద్యుచ్ఛక్తిని పల్లెలలోనికి గూడ ప్రసరింపజేయు అవకాశ మున్నయెడల దాని సహాయమున గ్రామీణులు తమ పనిముట్లను వినియోగించు కొన్నచో నాకు పట్టింపు లేదని మహాత్ముడు 22 6—35 తేదీ 'హారిజన్ పత్రికలో' వ్రాసియున్నాడు. "కొద్దిమంది చేతులలో సంపత్తిని అధికారమును కేంద్రీకరింప జేయుటకు యంత్రముల నుపయోగించుట పాతక మని నేను భావించుచున్నాను. ఈ రోజులలో యంత్రము యీ మార్గమున నుపయోగింపబడు చున్నది"అని 20—9—1925 తేదీ 'నవజీవన్'పత్రికలో మహాత్ముడు ప్రకటించియున్నాడు. ఇందు సామ్యవాది ఒప్పుకొనని మాటయేది?

పెద్దపెట్టున యంత్రమయ మొనరించుటయు, పారిశ్రామిక మయ మొనరించుటయు, పెట్టుబడిదారుల మార్గమను కారణమువల్లను, దానివల్లవచ్చు ఫలితములు ప్రజాతంత్ర వ్యాప్యములు, సమాజ విరుద్ధములు అను కారణమువల్లను, మహాత్ముడు దానిని నిరసించెను. పాశ్చాత్యులలో మానవ జీవిత చరిత్రకారులు, యిప్పుడిప్పుడే యీ నిర్ధారణకు వచ్చుచున్నారు.

అమెరికా దేశపు ప్రఖ్యాత మానవజాతి చరిత్రకారుడు వ్రాసిన గ్రంథములలోగూడ (Technics and civilization; The culture of the cities) పెద్దపట్నములను, పెద్దయంత్రాగారములును, యీ నాటికి పనికిరానివని, అభిప్రాయ పడినాడు. 19 వ శతాబ్దములోని యంత్రకళా కౌశలాభివృద్ధివలని చెడుగులను గురించి చెప్పుచు పైశాచిక వాదమని పేరుపెట్టెను. అతని గ్రంథములరీత్యా విద్యుచ్ఛక్తి

ప్రసారమును, నియమితవర్గ విధానమును, దేశమును దరహాము మీాద ఆరోగ్యకరముగను, స్వయంపోషకముగను చేసి సామాజిక వ్యాపారాభివృద్ధులచే కలకలలాడు చక్కని జనపదముల నెలకొల్పినదని ప్రశంసించెను. జి. డి. హెచ్. గోల్ అనునాతడు నుడివినట్లుగా మిక్కిలి అభివృద్ధిచెందని మానవ విజ్ఞానమునకు సహకారపద్ధతిమీాద ఆధారపడిన వ్యాపార పరిశ్రమలు, తగినవిగానుండి లెనిన్ కలలుకన్న స్వాతంత్ర్యము, సమత్వము కలిగిన సమాజము సాధ్యపడునని తోచుచున్నది. ఏకాశయపక్ష నియంతృత్వమో, నిరంకుశత్వమో తెచ్చిపెట్టు ఆర్థిక కేంద్రీకరణ విధానము, వ్యాపారవిధానమును, నిర్మూలముకావలెను. పాలిత పాలకభావమును తొలగింపవలెనను సామ్య వాదాదర్శము కొద్దికొద్ది భాగములుగా దేశమును విభజించుటచే సమకూరగలదు. అట్లు చేయుటవల్ల యిచ్ఛా, సహకారమునకు ఎక్కువ అవకాశముకలిగి, నిర్బంధశాసనావశ్యకత తగ్గి పరిపాలనాసౌకర్యమేర్పడును. దాక్షిణ్యరహితముగా ఉత్పత్తి కేంద్రములను దగ్ధంచేయు యీా రెండవ ప్రపంచయుద్ధవిధానము వ్యాపార కేంద్రములను గురించి స్థానిక సంబంధముగను, కళాకౌశల సంబంధముగను క్రొత్త సమస్యలను తెచ్చిపెట్టినది. బాంబులవలని నాశనమునకు గురియైన యీాకాలము ప్రాంతీయమైన కొద్ది వ్యాపారసంస్థలకే తప్పక దారిచూపుచున్నదని చరిత్ర వ్యంగ్యభాషలో చెప్పుచున్నది. ఈ విషయములో మహాత్ముడు ప్రాతకాలపు మోడుగాక, ఆధునికపాశ్చాత్య జిజ్ఞాసువులకు ముందు దారితీయు గొప్ప వ్యక్తియగుచున్నాడు.

## మార్పు

ప్రస్తుత పరిస్థితినుండి సామ్యవాద సమాజమునకు పరివర్తనచెందుట యెట్లు సాధింపనగును. కొద్దికొద్ది వుత్పత్తి సంస్థల ద్వారా (గృహాపరిశ్రమ) ఆర్థికసంపత్తిని నియమించు ఉద్దేశ్యముతో తీసుకొనిరాబడిన దార్జన్య రాహిత్యోద్యమ స్వభావమునకును, శుద్ధసామ్యవాదుల భావములకును వ్యత్యాసమున్నది. అందొకటి వస్తువులకును మానవునికిని గల సాంఘికసంబంధము —అనగా యజమానత్వమును గురించిన భావభేదమైయున్నది. ఆ సంబంధములో మార్పు తీసుకురావలెనని సామ్యవాదము ప్రయత్నించును. ఇంతకుపూర్వమే ఉత్పత్తి సాధనములయొక్క యజమానత్వమువలన కలుగు నష్టమంతగా లేదనియు, రష్యాలో వలెనె జాతీయ మొనరింపబడిన ఆర్థిక విధానముగూడ వర్గ రాహిత్య సమాజమును కల్పింపజాలదనియు తెలిసికొంటిమి. దీనికి ప్రత్యామ్నాయముగా మహాత్మాజీ మనకిచ్చిన విధానమేమనిన వ్యక్తిగతపు టాస్తులను రద్దుచేయుటకు బదులు సమాజము తరఫున యజమానులు ఆస్తులకు ,ధర్మకర్తలై యుండు నట్లును, అట్లు చేయగలుగుటకు నైతిక ప్రబోధమునకు తోడుగ ప్రభుత్వపు అధికారమునుగూడ వినియోగించవలెనని చెప్పెను. ధర్మకర్తలుగా నున్న వారికి సామాన్యులకు వచ్చు ఆదాకు 12 రెట్లకన్న అధికాదాయ ముండరాదని నిర్ణయించెను. ఆస్థిపరుల హృదయపరివర్తనమునందు నమ్మకము పెట్టుకొన్న యీ విధానముమీాద ఎందరో తీవ్రముగావిమర్శించిరి. అట్టివారిలో నేనొకడను. ప్రపంచపు పెట్టుబడిదారీ విధాన మొనరించిన మహాపచారములను మనసులో నుంచు కొన్నచో అట్టి పెట్టుబడిదారునే ధర్మకర్తనుచేయుట యన గాబరాగానుండును. ఆ పెట్టుబడి

దారే స్వతంత్రుడైన ధర్మకర్తయై అట్టి వానిని నియమ బద్ధుని జేయు చట్టము లేకుండ విడిచిపుచ్చుచో, నతడు పెట్టునదే బిచ్చమై తన యిచ్చవచ్చినట్లు చేయును. పెట్టుబడికాని మహాత్ముని సూచనలో ధర్మకర్తగా చెప్పబడిన పెట్టుబడిదారునకు అట్టి స్వాతంత్ర్యము లేకుండ చేయబడినది. ధర్మకర్తృత్వమను పదమునందేమి యిమిడి యున్నదో పరిశీలన చేసినచో, ఆ పదమునకు ప్రాముఖ్యమైన ఒక్కొక్క భావము కన్పించును. ధర్మకర్తృత్వమనగా చట్ట నిర్వచన ప్రకారము, 'ఏ' అను నొక వ్యక్తి ధర్మకర్త. 'బి' అనువాని ప్రయోజనము కొరకు, (అనుభ వించువాడు) వినియోగించుటకై యేర్పడిన ఆ స్తికి అట్లు విని యోగించు నంత కాలము చట్టముద్వారా కట్టుబాటు చేయ బడిన యజమాని అనునది ధర్మకర్త. 'ఏ' చట్టబద్ధమైన తన యజమానిత్వమును దుర్వినియోగపరచి స్వలాభము కొరకు వినియోగించుకొన్నయెడల చట్టముద్వారా తన అధికారము తొలగింపబడును. ఏ కు ఆస్తిమీద ఏర్పడిన హక్కులు చట్ట ముద్వారా యేర్పడినవి. సామాన్యముగా యిప్పుడున్న ఆస్తి పరులకు దీనిని వర్తింపజేసి చూచినచో జాతి అంతటి ఉపయో గార్థమువినియోగించవలెనను నియమముతో ప్రభుత్వము ఆస్తు లను వీరి స్వాధీనమునం దుంచినట్లగును. ప్రత్యేకలాభముకొరకు తన వశమందున్న ఆ స్తిని వినియోగించు చున్న ఆ స్తిపరు డేవ డైనను ఏర్పాటును అతిక్రమించినవాడుగ ఎంచబడి యజమానిత్వమునుండి తొలగింపబడును. మరియొక రక ముగా చెప్పుకొన్నచో ఇది పెట్టుబడిదారీ విధానము, సాగ కుండ చేయబడిన పద్ధతి. పెట్టుబడిదారీ దృక్పథములోని ఆస్థి హక్కులన్నిటిని సంపూర్ణముగా తుడిచివేయుటయే

యగును. ఒక కర్మాగారపు యజమాని ప్రభుత్వము తయారు చేయమన్నరకపు వస్తువులను కోరినన్ని తయారుచేసి, ప్రభుత్వము నిర్ణయించిన ధరలకు విక్రయించవలసి యున్నది. నూటికి 5 లేక 6 చొప్పున అతని వాటాకు లాభము మిగులును. ఈ ప్రకారము ఆస్థిని కలిగిన ఒక యజమాని పరిస్థితి రష్యాలో జాతిపర మొనర్పబడి పరిశ్రమయని ఘనముగా చెప్పు కొనుచోట ప్రభుత్వ పత్రములమీాద నూటికి 7 చొప్పున ప్రభుత్వ లాభములనుండి వడ్డీ రూపమున తీసుకొను ఒక పెట్టుబడిదారునికన్న యెట్లు హీనముగా కన్పడుచున్నది ? కనిష్ఠ ఆదాయమునకును, గరిష్ట ఆదాయమునకును 1: 12 నిష్పత్తి సూచించిన మహాత్ముని పద్ధతి రష్యాయందిప్పు డమలులోనున్న 1: 80 నిష్పత్తికన్న మెరుగుకదా ? కుతర్కములను కట్టిపెట్టి సరిగా ఆలోచించినచో, రెంటికిని పరస్పరము పోలికలున్నవి. ఈ ధర్మకర్తృత్వ విధానము, కాల్పనిక జగత్తులోని సాంఘిక వాద సమాజమునకు పరివర్తన మార్గమేనని, ఎవరైన చెప్పినచో ప్రజాతంత్ర విధానమును ప్రతిష్టిత మొనర్చి, తన పనిని ముగించు కొని, నియంతృత్వ విధాన ప్రభుత్వము తనకు తానే తొలగి పోవునని భావించుటకన్న, యేమంత కాల్పనిక జగద్భ్రాంతిపై దానిలో నున్నదని ప్రశ్నించును. పై రెండు నమ్మకములందును మహాత్ముని ఆశావాదము సామ్యవాదుల ఆశావాదమును మీారిన సాహసిక చర్యకాదని నా భావము.

జాతీయ మొనరించిన విధానమును వదలివేసి, ధర్మకర్తృత్వ విధానమే అవలంభించుటకు కారణము లున్నవని నే ననుటలేదు. గతించిన విషయముల వలన మనకు కలిగిన నూతన జ్ఞానమునుబట్టి, సాంఘిక వాద సమాజమునకు పరివర్తన జరుగు

కాలములో, యజమానిత్వమున కన్న, పెత్తనమే ముఖ్య మనియు, వ్యక్తులను ఆస్తులకును గల పరస్పర సంబంధము అనేక రూపముల ఆర్థిక జీవితములో పని చేయవలసి యున్న దనియు తెలిసికొన్నాము. వివిధ పద్ధతులలోను, పేర్కొన దగినవి ప్రభుత్వ యాజమాన్యము, స్థానిక స్వపరిపాలనా యాజ మాన్యము, వ్యవసాయిక పారిశ్రామికోత్పత్తి దారుల సహ కార సంఘములు, లేక సమితులు మండలులు, మరియు ప్రత్యేక యాజమానిత్వములు.

వీటి యన్నిటిమీదను నిబంధనలు ఎంత తక్కువగానున్న అంత మంచిది. స్వాతంత్ర్యమును నిలబెట్టుటకు అమెరికా రాజ్యాంగ చట్టనిర్మాతలు కనిపెట్టిన రాజకీయ నిబంధనలును, సమత్వ సాధనములును మన ఆర్థిక పద్ధతులకుకూడ ఉపయోగ కరముగ వర్తింపజేయవచ్చును. 'ధర్మకర్తృత్వము' అను పద ప్రయోగముయొక్క విలువ ఆ పదసౌందర్యములో లేదు. పరి వర్తనకాలమునకు తగినవిధముగా అది అర్థమును యివ్వగల స్థితి స్థాపకత్వము దానిలోనుండుటయే దాని విశేషము. ఈవిధానము అందుకు భిన్నముగా ప్రవర్తించినవారిని రద్దుచేయుటో, నశింప చేయుటో, ముందు జరుగుటకు వారి తప్పును సవరించుటకు చేయు ప్రబోధము, నైతికముగాను, సామాజికముగాను, చాల విలువగలదని నొక్కి చెప్పుచున్నది. ఈ ప్రబోధము, అతిశయ ముగా చేయబోవునది లేకపోయినను, సామాజిక పరివర్తనము నకు కలుగు అడ్డంకులను బలహీన పరచును. మన ఆశయ సిద్ధి కొరకు ప్రస్తుతమున్న దానిస్థానే కొత్తదానిని తెచ్చిపెట్టుట అవసరమేగాక వాంఛనీయమని గూడ ప్రబోధించును. మరియు సమాజ సంస్థల మూలసూత్రములో మొండిపట్టుదలకన్న,

జాగ్రత్తమైన పరిశోధనలు మనఃపూర్వకముగా జేయుట అవసరమని తెలియజేయును.

కారల్ మార్క్సు మహాశయుడు రాజకీయార్థిక విచారమునకు తన రచనలవల్ల గొప్ప సాయము చేసినాడు. సాంఘిక వాదాభిప్రాయులలో అన్ని పక్షములవారును అతని అభిప్రాయములలోని అమూల్యాంశములను గ్రహించి జ్ఞానాభివృద్ధిని సంపాదించినారు. చరిత్రపై అతనిప్రభావము గాఢముగా ప్రసరించునని తలంచెదను. అయితే మతప్రవక్త బోధనలను క్రైస్తవ దేవాలయమువారు మొండిగా విశ్వసించినట్లే, మనము ఆయన సిద్ధాంతములను గ్రహింపరాదు. ఇట్లు చేయుటవల్ల వ్యక్తి గౌరవమునుబట్టి యొక సిద్ధాంతమును మూఢముగా నమ్మపద్ధతి తొలగించినట్లగును. మార్క్సు బోధనలను మూఢముగా నమ్మట గుప్తవిధానమున ప్రజల పాలిటి నల్లమందని లెనిన్ నిరసించిన మతమును మరియొక రూపమున తెచ్చిపెట్టి నట్లగును. ఇట్టి మూఢవిశ్వాసమువలని ప్రమాదము గురించియే తన అవసానదశలో మార్క్సు మహాశయుడు "ఈశ్వరునకు కృతజ్ఞతాభి వందనములు. నేను మాత్రము మార్క్సు అనుయాయి"ని కాను అని చెప్పెను. [దీని భావమేమన, తన అనుయాయులు తన్ను మూఢముగ నమ్ముచున్నారనియు తానట్టి స్వభావము గలవాడను కాననియు మార్క్సు చెప్పెను.]

మనము తప్పక మార్క్సు అనుయాయులముగానో, లేక గాంధీ యనుయాయులముగానో యీనాడు ఏర్పడవలసిన అవసరములేదు. ప్రతివానివల్లను అతని సామర్థ్యమునకు తగినంత పని, ప్రతివానికిని వాని అవసరములకు తగినంత ప్రతిఫలమను సిద్ధాంతముకలిగి స్వాతంత్ర్యమును ప్రజాతంత్రమును